# స్త్రీల హక్కులు సమస్యలు



రచన

మల్లాది సుబ్బమ్మ

ప్రచురణ

మల్లాది పబ్లికేషన్సు

9, ఎం.ఐ.జి.హెచ్, మెహిదీపట్నం

హైదరాబాద్-500 028

అభ్యుదయ వివాహ వేదిక ప్రచురణ నెం.3

ప్రతులు 500

ముద్రణ 1986

సంకలన కర్త: మల్లాది సుబ్బమ్మ

పబ్లిషర్సు:-

అభ్యుదయ వివాహవేదిక,

నెం. 3

9, ఎం.ఐ.జి.హెచ్, మెహిదీపట్నం

హైదరాబాద్-500 028

ప్రతులకు;

'మల్లాది పబ్లికేషన్స్'

9, ఎం.ఐ.జి.హెచ్., మెహిదీపట్నం, హైదరాబాద్-500 028

ఫోను: 35429

వెల రు: 6-00

ముద్రణ: స్నేహలతా ప్రింటర్సు,

బర్కత్ పుర, హైదరాబాద్-500 027

ఫోను: 66618

# మానవ హక్కులు:- మహిళల హక్కులు

మార్పు రావాల్సింది మన చట్టాలలో కాదు, మన మహిళల మనస్తత్వాలలో. స్త్రీల పోరాటం కేవలం తమ హక్కులను గుర్తించటంతో పాటు ముఖ్యమైన రాజకీయ సమస్యలలో తగు నిర్ణయాలు తీసుకోగల సమర్థత, అవకాశాలు రావాలని. అవి రానిదే ఈ దేశానికి ప్రగతి లేదు. మన రాజ్యాంగంలో స్త్రీకి పంచాయతీ నుంచి పార్లమెంటు వరకు పాల్గొనే హక్కు వుంది. కాని ఆచరణలో అది వ్యర్థమవుతోంది. నిమ్న జాతులతోపాటు స్త్రీల వెనుకబాటుతనమే దీనికి కారణం. ఆడవారి హక్కులు, అభ్యుదయం కేవలం ఉపన్యాసాలకు, శాసనాలకే పరిమితమవుతున్నాయి. సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో వెనుకబాటుతనం ఇంకా విలయ తాండవం చేస్తోంది. ఈ పరిస్థితి వల్ల నష్టపడేది కేవలం స్త్రీ లోకమే కాదు. సమాజం, దేశం కూడా అని చెప్పాల్సిన పనిలేదు. కనుక ఈనాటి స్త్రీకి విద్యా వివేకాలతోపాటు రాజకీయ అవగాహన చాలా అవసరం. అంటే తన హక్కులు తెలుసుకోవటం, వాటిని అనుభవించ గలగడం ఆమెకు చాలా అవసరం.

అసలు హక్కులు అంటే ఏమిటి ? అవి ఎన్ని రకాలుగా వున్నాయి. అవి అనుభవించటానికి తగిన ధైర్య స్థయిర్యాలు మన స్త్రీల కున్నాయా ? హక్కులు ఎలా తెలిసికోవాలి ? ఆ హక్కులలో లోపాలు ఏమైనా ఉన్నాయా? ఉంటే అవి ఎలా సవరించాలి ? అనే కొన్ని ఆలోచనలు మన ముందు వున్నాయి. కనుక ముందుగా మనకున్న హక్కులు తెలిసికోవటం చాలా అవసరం.

1. స్త్రీల హక్కులు మానవ హక్కులలో భాగం. మానవ సమాజంలో స్త్రీలు సగభాగం. కనుక మానవ హక్కులు వారికీ వర్తిస్తాయి.

2. హక్కులూ బాధ్యతలూ, బొమ్మా, బొరుసు లాంటివి. బాధ్యతను అంగీకరించక పోతే హక్కులు లేవు. హక్కులు లేనివారికి బాధ్యతలు లేవు.

1776 లో అమెరికను విప్లవంలో ఎలుగెత్తి చాటిన అంశం ఇంగ్లండు రాజుకు వ్యతిరేకంగా అమెరికా ప్రజలు కోరినది. 'ప్రాతినిధ్యం లేనిదే పన్నులు చెల్లించ నవసరం లేదు' అని.

3. కాగా ఇన్ని శతాబ్దాలనుండి బాధ్యతలనే పేర్కొన్నారు. కనుక ఇపుడు హక్కుల విషయంపై నొక్కి పెట్టాల్సి వున్నది.

ద్వితీయ ప్రపంచయుద్ధకాలంలో హెచ్.జి.వెల్సు [H.G.Wells] 'మానవ హక్కుల ప్రణాళికను' తయారు చేయ పూనాడు - ప్రపంచ నాయకుల సాయం కోరాడు. మహాత్మాగాంధీనికూడా కోరాడు. గాంధీబాధ్యతలపై నొక్కి పెట్టమని సలహా చెప్పారు. మొదటినుండీ బాధ్యతలనే పేర్కొంటూ వచ్చారు. కనుక హక్కుల ప్రస్తావన అవసర మైనది. 1948 లో మానవ హక్కుల ప్రకటనను (10 డిసెంబరు) ఐక్యరాజ్య సమితి (Human Rights Commission) వారు ఆమోదించారు.

4. ఇంతవరకు స్త్రీల పట్ల బాధ్యతలనే ఉటంకించటం జరుగుతోంది. కనుక హక్కుల ప్రస్తావన ఇటీవలి వరకు రాలేదు. భార్యగా, తల్లిగా ఆమె విధ్యుక్త ధర్మాలను గురించి విపులంగా చెప్పటం జరిగింది.

5. మానవజాతిని కొనసాగించే ధర్మ నిర్వాహణలో తాము చేస్తున్న ప్రత్యేకమైన పని (పిల్లలను కనడం) సందర్భంగా, దాని కవసరమైన ప్రత్యేక సౌకర్యాలు, (Maternity Leave etc.) ఏకాంతతకు (PRIVACY) వలసిన ప్రత్యేక సదుపాయాలు (Separate Latrines, Lavatories) తప్ప ఇతరత్రా స్త్రీలు అదనంగా ఏమీ కోరటం లేదు. మానవ హక్కులను తమకూ వర్తింప చేయమని కోరుతున్నారు.

6. ప్రసవ కాలంలో స్త్రీకి అవసరమైన విశ్రాంతిని ఆసరాగా తీసుకొని ఆమెను ఇంటి పనికి పరిమితం చేశారు.

వేటాడే సమాజంలో, అరణ్యాలలో కాయగూరలను, పండ్లను, ధాన్యాలను ఏరుకొని తినే రోజుల్లో స్త్రీ సామాజిక జీవితంలో ముఖ్య పాత్ర వహించింది. కాగా నాగలి వచ్చి పొలాలని దున్ని పైరులు వేసి పెంచే

కాలానికి ఆమె స్థితి దిగజారి పోయింది. ఆమెను హీనస్థితికి చేర్చారు. దీనికి కారణాలు అనేకం:- వీటి అన్నింటి జోలికి మనం పోనవసరం లేదు. కాగా ఒక దానిని మాత్రం పేర్కొన వచ్చు. సంతానం తనది అని నమ్మడానికి ఆమెను భర్త స్వంతం చేసుకోవాలి. అందుకే ఆమెపై ఆంక్షలు లజ్జ, వినయం, అణకువ, భయభక్తులు మంచి లక్షణాలుగా ఆమెకు బోధ సాగింది.

i) మొదట్లో స్త్రీ పురుషుని సొత్తు. ఆమె ఇష్టా యిష్టాలతో నిమిత్తం లేకుండా ఆమెను అతడు ఎత్తుకొని పోవచ్చును. పెండ్లాడ వచ్చును. ఉంపుడు గత్తెగా ఉంచుకోవచ్చును, దాసిగా వాడుకోవచ్చును.

ii) తరువాత దశలో అమె పురుషుని దాసి బానిస. "నీ పాద దాసిని" అనే మాటలు నేర్పారు. పతిసేవయే పరమావధి అయింది. అమెకు వ్యక్తిత్వం. లేదు. భర్తకు అణకువగా ఉంటానని పెళ్ళినాడే ప్రమాణాలు చేయిస్తారు.

iii) ఈ నాడు స్త్రీ స్థితి రెండవ తరగతి పౌరురాలుగా మార్పు చెందింది. ఎన్నో కష్టాలు పడి అమె పౌరసత్వ హక్కులను సంపాదించుకొంది. 19వ శతాబ్దంలో న్యూజిలాండులో స్త్రీలకు వోటుహక్కు వస్తే, స్విట్జర్లాండు స్త్రీలకు 1978లో వచ్చింది.

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం నినాదాలుగా చెలరేగిన ఫ్రెంచి విప్లవంలో పాల్గొన్న ఫ్రెంచి స్త్రీలకు 1944 లో వోటు హక్కు వచ్చింది బ్రిటిషు స్త్రీలకు 1921 లో వోటు హక్కు వస్తే భారతదేశ స్త్రీలకూ వచ్చింది, పోరాడింది బ్రిటిషు స్త్రీలు, తేలికంగా సంపాదించుకున్నది భారత స్త్రీలు.

ఇదంతా గత చరిత్ర.

దీనిని గురించి ఎంతైనా చెప్పుకో వచ్చు, ప్రస్తుతానికి వద్దాము. స్త్రీలు కోరుతున్నది మరేమీ కాదు. మనవ హక్కులను తమకు వర్తింపచేయమని మాత్రమే.

ప్రతి వ్యక్తి జీవించడానికి, స్వేచ్ఛగా మనడానికి, ఆనంద ప్రాప్తిని సాధించడానికి మౌలికంగా హక్కు లున్నాయి.

అసలు ఇక్కడ స్వేచ్ఛ అనే భావనను పరిశీలించాలి. ప్రతి జీవి చిన్న పురుగునుండి మనిషిదాకా, బ్రతకాలని కోరుకుంటుంది. మనుగడ, సాగించటానికి ఆరాట పడుతుంది. అయితే మానవునికి ఆలోచనా శక్తి, ఉద్వేగమూ, కోపం, సంతోషం వగైరా ఉన్నాయి. వీటి స్థాయిలో అది స్వేచ్ఛా పిపాస (స్వేచ్ఛ కోసం ఆరాటం) గా మారుతుంది. ఈ స్వేచ్ఛ (స్వ + ఇచ్ఛ = స్వంత కోరిక) అన్ని రంగాలకు పర్తిస్తుంది. సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, నైతిక, మానసిక రంగా లన్నింటా కనిపిస్తుంది. ఈ అన్ని విభాగాలలో మనిషి స్వేచ్ఛను ఆటంక పరిచే శక్తులు, అడ్డువచ్చే అంశాలు-అవరోధాలు-ఎదురవుతాయి. వీటిని దాటడానికి మనిషి ఎల్లప్పుడూ తపన చెందుతూ వుంటాడు. స్వేచ్ఛ అనగానే నిర్నిబంధమైన స్వేచ్ఛ అని ఎవరూ భావించరాదు. ఒకని స్వేచ్ఛ మరియొకని స్వేచ్ఛపై అదుపును పెట్టుంది. మనమంతా సమాజంలో బ్రతుకుతున్నాము. సమాజం యొక్క మౌలిక సూత్రం సహకారం. అందువల్ల ఒకరి స్వేచ్ఛ మరొకరి స్వేచ్ఛను హరించరాదు. కనుకనే మన రాజ్యాంగాలలో కూడా మౌలిక హక్కులను పేర్కొంటూ వాటిని నీతికి, సభ్యతకూ, ఆరోగ్యానికీ, సామాజిక భద్రతకూ లొంగి ఉంటాయని స్పష్టీకరించటం జరిగింది.

స్వేచ్ఛఅనే భావనకు సహకారం అనే మౌలికభావాన్ని ఇలా జోడించడం జరిగింది. అయితే ఇక్కడ మరో విషయం గమనార్హం. స్వేచ్ఛను పొందడానికి, స్వేచ్ఛను లేకుండా చేస్తున్న శక్తులను, అంశాలను గురించి తెలుసుకోవాలి. అపుడే బాధనుండి ముక్తి లభిస్తుంది. చలి వల్ల బాధపడిన ఆదిమ మానవుడు, వర్షంవల్ల వెతల చెందిన మన పూర్వీకుడు కొండగుహలను ఆశ్రయించాడు. తరువాత ఇళ్లు కట్టుకున్నాడు. శీతోష్ణస్థితిని అదుపు చేసుకోవటానికి యంత్రాలను కనుగొన్నాడు. ఇదంతా అతని సత్యాన్వేషణ కృషి. స్వేచ్ఛా పిపాసకు తోడుగా ఉండేది సత్యాన్వేషణ. సత్యాన్వేషణ వల్లనే శాస్త్రజ్ఞానం (SCIENTIFIC KNOWLEDGE) పెరిగింది.

ఇలా మానవ సమాజాన్ని నియంత్రణం చేసే మౌలిక భావాలు స్వేచ్ఛా పిపాస, సత్యాన్వేషణ, సహకార భావన అని తేలింది.

8. స్వేచ్ఛ అంటే జంతుస్థాయి జీవితాన్ని గడపటానికి మాత్రమే వెసులు బాటు కాదు. ఆహార నిద్రా మైథునాలు జంతువులకూ, మానవులకూ సామాన్య లక్షణాలే. కాగా మానవుడు బుద్ధి జీవి. ఆలోచించగలడు. భాషను, పని ముట్లను నిర్మించుకోగలడు, తన భవిష్యత్తును తను దిద్దుకోగలడు. తన ఊహా శక్తిని (IMAGINATION) వినియోగించుకోగలడు. తన జ్ఞానాన్ని, ఆలోచనలను తన ముందు తరాలకు అందజేయగలడు.

అతడు తన అంతర్గత శక్తుల వికాసాన్ని కోరుకుంటాడు. తన భుక్తి కోసం కేవలం ఏ రెండు గంటలు మాత్రమో పనిచేసి, మిగతాకాలాన్ని తన ఇచ్ఛవచ్చిన రీతిని కవిత్వం చెప్పుకుంటూనో, లేక పాటలు పాడుకుంటూనో, లేక నాటకాలు వేస్తూనో, లేక చిత్రాలను గీస్తూనో, లేక శిల్పసాధన చేస్తూనో, గ్రంథ రచన చేస్తూనో, కాకపోతే గుర్రపుస్వారీ చేస్తూనో, ఇలా ఎన్నో రీతుల వినియోగించుకోగల సమాజాన్ని ఆశించాడు మార్క్సు. అది అతని సుందర స్వప్నం. దానిని 'యుటోపియా'- అనుభవంలోకి- రాజాలని ఊహాచిత్రం అన్నారు కొందరు. ఏదైనా ఇతర మేధావులూ ఇంచుమించుగా అలాంటి కలలే కన్నారు. అందరూ ఆనందాన్నే (HAPPINESS) ఆశించారు.

9. ఆనందం ఎలా లభిస్తుంది ? ఈ పదాన్ని అమెరికను రాజ్యాంగం లో వాడారు. ప్రతి పౌరునికి జీవించడానికి, స్వేచ్ఛను పొందడానికి, ఆనందాన్ని పొందడానికి హక్కు ఉన్నదని వ్రాశారు అమెరికన్లు. నేను తాత్విక విషయాల జోలికి పోతున్నానని ఎవరూ భావించవద్దు. వీలయినంత వరకు తాత్విక, మత విషయాలను నేను తడవ దలచలేదు.

మనిషికి మనస్సు ఉంది. ఆలోచన ఉంది. కోరికలు ఉన్నాయి. అవసరాలు ఏర్పడుతాయి.

ఈ అవసరాలు తీరితే కొంతగా కొంత ఆనంద ప్రాప్తి లభిస్తుంది. అవసరాలు అనేక రకాలు.

i. భౌతిక అవసరాలు :- ఇల్లు, (ఎండ వానల నుండి రక్షించు కోటానికి.)

ii శారీరక అవసరాలు :- ఆహారం, వైద్య సదుపాయాలు, విశ్రాంతికి వెసులుబాటు వగైరాలు.

iii. మానసిక అవసరాలు :- విద్య, జ్ఞాన సముపార్జన, కళాత్మక భావన (సౌందర్య పిపాస), సృజనాత్మక కృషి ...

iv. పై మూడింటిని అధిగమించిన అవసరాలు

కొంతమంది వాటిని ఆధ్యాత్మిక అవసరాలు [Spiritual Needs] అంటారు. మరికొందరు వాటిని సమ్యక్ [Integrated] అవసరాలని పేర్కొంటారు.

ఇందులో వ్యక్తిగత సమతుల్య మానసిక స్థితి [Balanced state of mind], రాగ ద్వేషాదులకు [Attachment = రాగం, Hatred = ద్వేషం) అతీతమైన దృష్టి. మానవాళియెడల సమదృష్టి, సృష్టియెడల సమ్యక్ దృష్టి [Integrated outlook], ఇమిడి ఉన్నాయి.

ఇది ఎరిక్ ఫ్రామ్ (అమెరికను మానసిక శాస్త్రజ్ఞుడు) చేసిన విశ్లేషణ.

ఈ అవసరాలు తీరిననాడు మానవునికి ఆనందప్రాప్తి. ఇవన్నీ ఒక్కసారిగా తీరవు. సమాజ గతిని అనుసరించి క్రమక్రమంగా తీరుతాయి; స్వేచ్ఛ అన్నా కూడా మానవుని వ్యక్తి వికాసానికి అవరోధాలుగా ఉన్న వాటిని క్రమ క్రమంగా తొలగించుకోవడమే. ఇలా వ్యతిరేకార్థంలో చెప్పుకోవలసి వచ్చింది. లేకపోతే నిర్వచనం సమగ్రం కాదు.

వ్యక్తి వికాసం అనగానే ప్రతివ్యక్తిలో ఉన్న అంతర్గత శక్తులు-అంటే సృజనాత్మకమైనవి, శుభప్రదమైనవి, సమాజానికి మంగళప్రదమైనవి మాత్రమే సుమండీ- పెరిగి పరిఢవిల్లటానికి వీలు, వెసులుబాటు అని అర్థం చెప్పుకోవాలి. ఉదాహరణకు సంగీతమంటే చెవికోసుకునే మనిషి, లయజ్ఞానం కలిగిన వ్యక్తి సంగీత సాధన చేసుకోవాలంటే అవకాశం ఉంటే అది ఆ వ్యక్తి వికాసానికి దోహదం కలిగినట్లు భావిస్తాం. ఇలా ఎన్నో ఉదాహరణలు చెప్పుకుంటూ పోవచ్చు.

10. ఇలా కొంత మౌలిక భావాల చర్చను కొంతగా చేసి అసలు విషయానికి - స్త్రీల హక్కుల విషయానికి - వద్దాము.

స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం అనే నినాదాలపై 1789లో ఫ్రెంచి విప్లవం సాగింది.

1917 నాడి రష్యన్ విప్లవం యొక్క ఇతర వైఖరులు, లక్షణాలు మనకు అంగీకారమైనా, కాకపోయినా ఆ విప్లవం మానవుల ఆర్థిక అవసరాలను సమాజ దృష్టికి తెచ్చింది. భారత దేశంలో మౌలిక హక్కులుగా కొన్నింటిని పేర్కొని, మరి కొన్నింటిని ప్రభుత్వానికి ఆదేశిక సూత్రాలుగా [Directive Principles of State Policy] వ్రాయటం జరిగింది.

మౌలిక హక్కుల అమలుకు పౌరుడు కోర్టుకు పోవచ్చును. ఆదేశిక సూత్రాల అమలుకు ఆ సౌకర్యం లేదు. కాగా ఆదేశిక సూత్రాలకు భిన్నంగా, వ్యతిరేకంగా ప్రభుత్వాలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సంచరిస్తుంటే, వాటిని ప్రతిపౌరుడు న్యాయస్థానాల ద్వారా నిరోధించవచ్చును. ఇపుడు రాజ్యాంగ పరమైన చర్చ విస్తృతంగా అనవసరం.

11. స్త్రీలు కోరేది ఏమిటి ?

స్వేచ్ఛ, సమానత్వం, వివక్ష నిర్మూలనం, మాతృత్వ విధినిర్వహణ ందర్భంగా కొన్ని అదనపు సౌకర్యాలు సదుపాయాలు. వ్యక్తి వికాసానికి ోహదం చేసే అవకాశాలు. వీటిని ఒక్కొక్క దానిని తీసుకొని వివరంగా, ్షణంగా చర్చించే ముందు మామూలుగా వినవచ్చే ఒకక్ ప్రతి వాదనను ర్కొని దానిని విచారించడం మంచిది.

స్త్రీలకు ప్రస్తుతం ఏమీ ఇబ్బందులు లేవు. వారు భర్తచాటున ఉంటూ, ని చేయవలసిన అవసరం లేకుండా, హాయిగా నీడన ఉంటూ, ఇంటిపై త్తనం సాగిస్తూ సుఖ జీవితం గడుపుతున్నారు. అనవసరంగా హక్కుల పేరతో ఆందోళనలు సాగించి చిక్కులు పడుతున్నారనేదే యీ వాదన రాంశం. ఈ వాదనలో పసలేదు. అసలు ఈ వాదనకు ఆధారాలు లేవు. ంటి సమాజాన్ని పరికిస్తే ఈ వాదనలో చిత్రించిన పరిస్థితి బహుసంఖ్యాకు

లైన స్త్రీలకు లేనే లేవు. మొదటి నుంచీ సమాజంలోని శ్రామిక వర్గాల స్త్రీలు పనిపాటలు చేస్తూనే ఉన్నారు. గిరిజనులలో, దళితులలో, వెనుకబడిన జాతుల్లో, స్త్రీలు కాయకష్టం చేస్తూనే యున్నారు. అడవులలో, పొలాలలో, తేయాకు కాఫీ, మొదలైన తోటల్లో, వారు శ్రమ చేస్తూనే ఉన్నారు. అవ నంగా ఇంటి పనీ చేస్తున్నారు. ఇటీవల పరిస్థితులు మరీ అధ్వాన్నమయాయి. స్త్రీలు ఫ్యాక్టరీలలో, కుటీర పరిశ్రమలలో, తమ ఇళ్ళల్లో శ్రమచేస్తూ. సంపా దిస్తూ కుటుంబ ఆర్థిక స్థితి మెరుగుదలకు దోహదం చేస్తున్నారు. చేతి పనులు సాగించే వర్గాలలో స్త్రీలు పలు రకాలయిన పనులు చేయడం మనం చూస్తున్నాం. ఉ॥ చేనేత రంగం. సమాజం పారిశ్రామికీకరణం కావడంతో, నగరాభివృద్ధి కావడంతో నగరాలలోని శ్రామిక స్త్రీలపై బరువు బాధ్యతలు ఎక్కువయినాయి. మధ్యతరగతి స్త్రీలు కూడా సంపాదిస్తే తప్ప కుటుంబ నిర్వహణ సాధ్యపడని పరిస్థితి ఉదయించింది. మధ్యతరగతి స్త్రీలు ఉద్యోగాలు చేస్తున్నారు. ఇంటిపని-సరేసరి. అది వారికోసం వేచి ఉంటుంది. ఏదో కొద్దిమంది, బహు కొద్దిమంది పురుషులు తప్ప - పురుషులు - దరహం పెద మాట - ఇంటి పని జోలికి రారు. ఇక పోతే ఉన్నత వర్గాలు అంటే ధనిక వర్గాల స్త్రీలు శ్రమ చేయటం లేదు. అంటే కాయ కష్టం చేయటంలేదు. కాని వారి పరిస్థితిని సర్వే చేస్తే వారు బంగారు పంజరంలోని చిలకల్లా ఉన్నారని తేలు తుంది. స్వేచ్ఛకు, వ్యక్తి వికాసానికి నోచుకోని జీవితం అది. షో కేసుల్లో బొమ్మలు వారు. డ్రాయింగు రూమ్‌కు అందం తెచ్చే ఒకరకపు వస్తువులు అంటే (డెకరేటివ్ పీసెస్) వారు.

కనుక ప్రతివాదన సమర్థనీయం కాదు. ఎంత త్వరగా అలాంటి పొరపాటు భావన నశిస్తే అంత మంచిది.

12. స్త్రీల హక్కులను పేర్కొనేటప్పుడు అన్ని మానవ హక్కుల జాబితా వ్రాయనక్కరలేదు. ప్రపంచంలో అనేక దేశాలలో, అనేక హక్కులు స్త్రీ పురుష లిద్దరికీ నిరాకరింపబడినాయి. వాటిని గురించి ఇపుడు ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అగత్యం లేదు. కాగా స్త్రీ కనుక ఆ మానవ వ్యక్తికి నిరాక రింపబడిన హక్కులను గురించి తెలుసుకోవలసి ఉంటుంది. వీటిని సామా

జిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక హక్కుల క్రింద విభజించి పరిశీలించటం యుక్తియుక్తం.

## (A) సామాజికం.

### i) కుటుంబాన్ని నెలకొల్పుకునే హక్కు:-

ప్రతి మానవ వ్యక్తి కుటుంబాన్ని నెలకొల్పుకోవటానికి హక్కు కలిగి యున్నాడు. (మన తెలుగు భాషలో స్త్రీ పురుషులకు సర్వసామాన్యంగా వాడటానికి తగిన పదజాలం లేదు. స్త్రీ పరంగా వాడినపుడు అప్రాణి వాచకాలకు వాడే క్రియా రూపాన్నే వాడుతున్నాం. ఉ॥ ఆమె అక్కడే ఉన్నది, కుర్చీ అక్కడే ఉన్నది. ఇది శోచనీయం, స్త్రీని గౌరవంగా చూడగల భాషను నిర్మించుకోవాలి.)

కుటుంబాన్ని నెలకొల్పుకోవటం అనే పదజాలంలో కుటుంబాన్ని నెలకొల్పుకోకపోవటం కూడ ఇమిడి వుంటుంది కుటుంబం అంటే ఇక్కడ అణు కుటుంబం అని అర్థం. సతీపతులతో కూడుకున్నది అణు కుటుంబం సంతానం ఆ కుటుంబంలో ఉత్పన్నమయిన జీవులు జీవిత భాగస్వామిని ఎంపిక చేసుకొని కలసి జీవించడానికి ప్రతి మానవ వ్యక్తికీ హక్కు ఉన్నదన్నమాట. కలసి జీవించడాన్ని క్రమబద్ధం చేసే పరిణామ ప్రక్రియలో వివాహం ఏర్పడింది. కనుక వివాహమాడటానికి లేక ఒంటరిగా ఉండటానికి ప్రతి మనిషికీ హక్కున్నదన్నమాట. ఈ హక్కును భారత రాజ్యాంగం కాదనలేదు. విధిగా ప్రతి వ్యక్తి పెండ్లి చేసుకోవాలని శాసించలేదు. అలా అన్నపుడు ఈ హక్కును భారత రాజ్యాంగం గుర్తించినట్లే లెక్క. మన దేశంలో అవివాహిత స్త్రీలు అనేకమంది ఉంటున్నారు. అయితే ఈ హక్కును సమాజం స్త్రీలకు నిరాకరిస్తున్నది. స్త్రీకి వివాహం పరమ ధర్మమన్నట్లు భావిస్తున్నది సమాజం, అవివాహిత స్త్రీని చిన్న చూపు చూస్తున్నది. తమ కుమార్తెలకు పెళ్ళి చేయమని, తల్లి దండ్రులను ఈసడిస్తున్నది. వ్రేలెత్తి చూపి ఆక్షేపిస్తున్నది. (దైవ సేవకు అంకితం చేయబడిన కన్యల విషయం వేరు) ఈ హక్కు అమలుకు రాజ్యాంగ పరంగా అవరోధాలు లేకపోయినా సామాజికంగా ప్రతిబంధకాలు అనేకం ఉన్నాయి.

## (ii) విడాకుల హక్కు :-

కుటుంబ జీవనం బాధాకరమైనపుడు భర్తనుండి వేరుగా ఉండి జీవించ డానికి, వివాహ బంధాన్ని విచ్ఛిన్నం చేసుకోడానికి స్త్రీకి హక్కు ఉండాలి. ఏ బంధంలోకి అయినా ఏ వ్యక్తిఅయినా ఇచ్ఛాపూర్వకంగా ప్రవేశించాలి కాని బలవంతంగా నెట్టబడ కూడదు; అలాగే బలవంతంగా ఆ బంధంలోనే జీవితం గడపమని ఒత్తిడి చేయకూడదు. ఈ సందర్భంలో ఒక విషయాన్ని విస్మ రించరాదు. మనదేశంలో వివాహం, విడాకులు, మనవర్తి, దత్తత, సంరక్ష కత్వం, ఆస్తి హక్కులు, వారసత్వం వగైరా విషయాలు వేరు వేరు మత ధర్మ శాసనాల పరిధిలోకి వచ్చాయి. హిందూ, ముసల్మాను, క్రైస్తవ, పార్శీ మతస్తులకు వేరు వేరు శాసనాలు ఉన్నాయి. కొన్ని మతాల వారి సందర్భంగా ఆ శాసనాలు పరిణామం చెందాయి. కొన్నింటిని సంపుటీకరణం చేశారు. ఉదాహరణకు హిందూ వివాహ శాసనం చివరకు 1955 లో రూపు తాల్చింది. ముస్లిం వివాహ శాసనం 1939 లో వచ్చింది. పార్శీలది 1936 నాటిది. క్రైస్తవులది 1869 నాటిది. ప్రత్యేక వివాహ శాసనం 1954 లో రూఢి అయింది. ప్రత్యేక వివాహ శాసనం క్రింద వివాహ మాడిన వారికి ఇది వర్తిస్తుంది. ఒకనాడు హిందువులలో బహు భార్యాత్వ నిషేధం లేదు. కొన్ని రాష్ట్రాలలో అది 1948 లో వచ్చి దేశం మొత్తానికి 1955 లో శాసన రూపం తాల్చింది. దేశంలో అధిక సంఖ్యాకులయిన హిందువుల శాసనాలు ఎక్కువగా మారాయి. అల్ప సంఖ్యాకులయిన ముస్లిం క్రైస్తవ, పార్శీ, మతస్తుల శాసనాలు అంతగా మారలేదు. దీని కారణా లను గురించి ఇప్పుడు వివరించాల్సిన అవసరంలేదు. కాగా కొన్ని సందర్భా ల్లో మతపరమైన అల్ప సంఖ్యాకుల శాసనాలు కొంతవరకు లోపభూయిష్టంగా ఉన్నాయని చెప్తే అది అల్ప సంఖ్యాక వర్గాలపై ద్వేషభావం వల్లనని భావిం చాల్సిన అవసరం లేదు.

అసలు విడాకుల విషయానికివద్దాం. హిందూ వివాహ శాసనంలోనూ, ప్రత్యేక వివాహ శాసనంలోను విడాకులు పొందటానికి స్త్రీలకుకూడా ఎక్కువ వెసులుబాట్లు వచ్చాయి. ఇరువురి సమ్మతిపైన విడాకులు పొందే హక్కు

్యబడింది. కాని, శాసకులు ఎవరైనా సరే, వివాహ రథం కుంటుపడిందని ్వారు నిర్ణయానికి వస్తే వెంటనే తప్పొప్పుల జోలికి పోయి భార్యాభర్తలను కు పరచకుండా విడాకులు ఇవ్వాలనే నిబంధన ఆ శాసనాలలో లేకపోవటం ్నీయం.

ముసల్మాను భర్త ఏక పక్షంగా భార్యకు విడాకులు ఇవ్వవచ్చును ాక్ అనే పదాన్ని మూడు సార్లు ఒకేసారి ఉచ్చరించి కాని, లేక ఒక్కొక్క ు మూడు పర్యాయాలు మూడు నెలల్లో అనిగాని విడాకుల ్వవచ్చును. పెండ్లి అపుడు ప్రత్యేకంగా ఒప్పందంలో వ్రాసుకుంటే తప్ప కి అలాంటి హక్కు లేదు. తలాక్ ఇవ్వటానికి భర్త కలసిరానప్పుడు ు విడాకుల కొరకు కోర్టుకు వెళ్ళాల్సి ఉంటుంది. హిందూ వివాహ ్నంలో పైన పేర్కొనబడిన లోపం ముస్లిం శాసనంలోనూ ఉన్నది.

క్రైస్తవ శాసనంలో విడాకులు పొందే హక్కు ఇంచుమించుగా ులకు మృగ్యమయింది. భర్తపై ఆమె రెండు నిందారోపణలు చేసి రుజువు ్యాలి. వ్యభిచారం కాక అదనంగా రెండవ భార్యను స్వీకరించటం, ్రమ సంబంధం కలిగి ఉండటం, అసహజ సంపర్కానికి ఒడిగట్టట ా ంటివి రుజువు చేయాలి. ముస్లిం, పార్శీ శాసనాల కన్నా ఇది వెనుకబడి ుది.

పార్శీ వివాహ శాసనంలో పరస్పర సమ్మతిపై విడాకులుగాని ాహ రథం కుంటు పడిందనే విషయం రుజువయితే విడాకులు గాని లేవు.

వివరాల జోలికి పోకుండా స్థూలంగా విడాకులను గురించి వివిధ మత ్మశాసనాల నిబంధనలను గురించిన వ్యాఖ్య ఇది.

విడాకులు ఎంత తేలికగా, ఎంత సజావుగా పొందగలిగితే ఆ సమా ు స్వేచ్ఛా వాతావారణాన్ని గురించి అంతగా అంచనా వేయగలం.

విడాకుల హక్కును గుర్తించటం ఒక యెత్తు. దాని అమలుకు వసతులు ్షు కల్గించటం మరొక ఎత్తు. హిందూ వివాహం యొక్క విచ్ఛేదన సదు

కోర్టులో పిటీషనుద్వారా సాధ్యం అవుతుంది. ముసల్మాను స్త్రీ విడాకులకోసం దావా వేసివుంటుంది. అది కాలహరణానికి, వ్యయ ప్రయాసలకు దారి తీస్తుంది. క్రైస్తవ వివాహ విచ్ఛేదన మరీ కష్ట సాధ్యం. జిల్లా కోర్టులో పిటీషను పెట్టే అక్కడ వచ్చే ఉత్తర్వును హైకోర్టు న్యాయమూర్తులు ఇద్దరిక్కి తప్పక వారంతా కూర్చొని ధృవ పరచాల్సి వుంటుంది. కాలయాపన, శ్రమలతో కూడినది ఈ ప్రక్రియ.

## iii. మనవర్తి హక్కు

వివాహం విచ్ఛేదన సమయంలో గాని, తత్సంబంధమైన వివాదం నిలపలో ఉన్నపుడు గాని స్త్రీ భర్తనుండి మనవర్తిని పొందవచ్చును. ఈ హక్కును ముస్లిం స్త్రీల పరంగా సంకుచితం చేయటం జరిగింది. విడాకులు ఇవ్వబడిన మూడునెలల వరకే (ఇద్దతు కాలం) పరిమితం చేసింది ముసల్మాను మత ధర్మశాస్త్రం. అనాధలు ఉండరాదనే దృష్టితో సర్వులకూ వర్తింప చేసిన క్రిమినల్ ప్రొసీజరు కోడ్ 125 వ సెక్షను పరిధి నుండి ముసల్మానులను తొలగించారు. 1986 లో వచ్చిన ముసల్మాను స్త్రీల రక్షణ చట్టం (అది నిజానికి భక్షణ చట్టం) ప్రకారం భర్త తప్ప తతిమ్మా వారు ఆమెను పోషించాలి. ఆమె తల్లి దండ్రులు, సోదరులు, ఆమె ఆస్తికి కాబోయ్యే వారసులు, చివరకు మతధర్మ సంస్థ వక్ఫ్ బోర్డు ఆమెను పోషించాలట. అంటే ఆమె హక్కును పేరుకు గుర్తిస్తూ దానిని ఆమె అనుభవించటానికివీలు లేకుండా చేయటం జరిగింది.

## iv. మతతత్వానికి సంబంధించిన హక్కు

పురుషునికి లేని అవకాశం స్త్రీకి ఉన్నది. అదే గర్భధారణ, ప్రసవాలకు సంబంధించిన వీలు. స్త్రీ మాత్రమే సంతానాన్ని తొమ్మిది నెలలు గర్భంలో మోసి కనగలదు. జాతి కొనసాగటానికి, సమాజపు మనుగడకు ఆమె సేవ గణనీయం. అందుకు ఆమెను అభినందించాలి ఆ సందర్భంగా ఆమెకు కొన్ని వెసులుబాట్లను సమపాయాలను, కల్గించాలి. ఆమె వ్యక్తిత్వ పరిరక్షణ జరగాలి.

సంతానాన్ని పొందడం, పొందక పోవడం, ఎప్పుడు సంతానాన్ని కలిగించాలో, ఎప్పుడు వద్దనుకోవాలో అంతా స్త్రీ అభీష్టంపై ఆధారపడాలి. వివాహిత స్త్రీని విధిగా సంతానాన్ని కనమని శాసించే హక్కు భర్తకు కూడా ఉండరాదు. పురుష సంతానం కలిగేవరకు- ఎంతమంది పిల్లలనైనా కనవలసిందే అనే ఉత్తరువు వేయటానికి భర్తకు కూడా అధికారం ఉండరాదు.

అంతేకాదు. 'అవివాహిత స్త్రీని మాతవు కారాదని' ఎవరూ శాసించగలుండరాదు. ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని ఆమెపై అలాంటి ఒత్తిడి తీసుకొని రాకూడదు. అవివాహిత మాతకు ప్రసూతి సెలవులను నిరాకరించిన విమానశాఖ ఉద్యోగి చర్యలను సుప్రీంకోర్టు ఇటీవల త్రోసిరాజన్నది సర్వజన విదితమే కదా!

వివాహానికి, సంతాన ప్రాప్తికి ఉన్న సంబంధాన్ని విడతీయాలి. స్త్రీకి తన దేహంపై తనకు ఆధిపత్యం ఉండాలి. ఆమె అనుమతిస్తే తప్ప ఆమె దేహంపై భర్తకు కూడా హక్కు ఉండరాదు.

## గర్భస్రావపు హక్కు :-

కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో గర్భస్రావం చేయించుకోవచ్చని కేంద్ర శాసనం 1971 లో వచ్చింది. ఇలాంటి శాసనం కెనడాలాంటి పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలలో కూడ లేదని తెలుసుకోవటం అవసరం. తల్లి ఆరోగ్యం కాపాడటానికి, బిడ్డ అంగవైకల్యంతో పుట్టుందని తెలిసినపుడు, కుటుంబనియంత్రణ పాటిస్తున్న స్త్రీకి ఆ సాధనాలు విఫలమై గర్భం వచ్చినపుడు, లేక ఆమె కోరని గర్భం వచ్చి ఆమె తీవ్ర మానసిక వ్యధకు లోనయినపుడు, ఆమెపై చేయబడిన అత్యాచార ఫలితంగా ఆమె గర్భవతి యైనపుడు వైద్యులు ఆమెకు గర్భస్రావం చేయవచ్చును. ఇది స్త్రీ విమోచనోద్యమానికి ఒక రకంగా విజయం. సెక్సు విప్లవానికి నాంది. స్త్రీయొక్క లైంగిక బానిసత్వం నుండి ఆమెకు విముక్తి మార్గం. సంతానం కనే యంత్రంగా ఉండాల్సిన అవసరం లేని స్థితిని కల్పిస్తున్న రాయితీ. అయినా దీని విషయమై కొన్ని మత సమాజాలలో ఆక్షేపణలు, అభ్యంతరాలు ఉన్నాయి.

## V. పెండ్లి ఎవరు చేయాలి? బాల్య వివాహ నిషేధం:-

1929లో వచ్చిన బాల్యవివాహ నిషేధ శాసనం వయస్సు విషయంగా మార్పుచెందుతూ చివరకు 1978లో రూఢి అయింది. అమ్మాయికి పెండ్లి నాటికి 18 సం॥ నిండాలి. అబ్బాయికి 21 సం॥ నిండాలి. అలా కాకపోతే తల్లి దండ్రులకు, 18 సం॥ దాటిన వరునికి శిక్షలు పేర్కొన బడినాయి. అంత వరకు సమంజసమే. కాని పెళ్ళి చెల్లదనే నిబంధన హిందూ ముసల్మాను మత ధర్మశాస్త్రాలలో లేదు. కాగా పార్శీమత ధర్మశాసనంలో 14 సం॥లోపు స్త్రీ వివాహం చెల్లదని స్పష్టంగా ప్రకటించ బడింది.

ముసల్మాను స్త్రీకి 15 సం॥ లోపు వివాహం అయితే 18 సం॥ నిండే లోపున-శోభనం కాకపోతే-ఆమె ఆ వివాహాన్ని కాదన వచ్చును. హిందూ స్త్రీకి 15 సం॥ లోపు వివాహ మయితే ఆమెకు శోభనం అయినా కాకపోయినా ఆమెకు యుక్తవయస్సు వచ్చిన తరువాత 18 సం॥ నిండేలోగా ఆమె ఆ వివాహాన్ని తృణీకరించవచ్చనే నిబంధన 1976లో వచ్చింది. 1872 క్రైస్తవ వివాహశాసనం ప్రకారం 21 సం॥ నిండని వధూవరుల వివాహానికి తండ్రి లేక సంరక్షకుని సమ్మతి కావాలి. (సెక్షన్ 19) అంటే 18 సం॥ నిండినా స్త్రీ వివాహానికి తండ్రి సమ్మతి కావాలి.

ఇదంతా చదివితే గోచరించేది ఏమిటి? 18 సం॥ నిండితే ఏ స్త్రీ అయినా మేజరు అవుతుంది. మైనరయిన బాలికను మరొకరికి వివాహం పేరుతో దత్తం చేయడానికి ఎవరికీ- చివరకు తల్లి దండ్రులకుకూడా-హక్కు ఉండరాదు. సంతానం తల్లి దండ్రుల వస్తువులు కాదు. వారి సొత్తు అంత కన్నా కాదు. బాలిక కాని బాలుడు కాని ఒక మానవ వ్యక్తి. ఆ వ్యక్తి జీవితాన్ని, శరీరాన్ని శాసించడానికి ఎవరికీ అధికారం పనికిరాదు.

మైనర్ల వివాహాలు చెల్లవనే శాసనం అవశ్యం రావలసి వుంది. స్త్రీ తన జీవిత భాగస్వామిని తానే నిర్ణయించుకోవాలనే సూత్రానికి ఇది అన్వయం.

మానవ వ్యక్తి అందులో ముఖ్యంగా స్త్రీ తన శరీరంమీద తనుమాత్రమే హక్కు కలిగి ఉండాలి. అనే మౌలిక సూత్రంయొక్క అనుసరణయే యీ అంశం.

(viii) వివాహిత స్త్రీకి కూడా తన దేహంపై హక్కు తనదే:-

ఈ హక్కును సూత్రప్రాయంగా అందరూ అంగీకరిస్తారు. కాని దాంపత్య ధర్మం పేరుతో, వివాహ విశిష్టత పేరుతో భర్తకు భార్య దేహంపై ఆధిపత్యాన్ని ఇవ్వడం జరుగుతోంది. భార్య ఇష్టా యిష్టాలతో నిమిత్తం లేకుండా ఆమె సంపర్కాన్ని భర్త ఆశించడం, సఫలీకృతుడు కావటం జరుగుతోంది. మరీ బాలిక అయితే తప్ప వివాహంలో జరిగే బలాత్కార సంపర్కంపై ఆంక్ష లేదు. వివాహం ద్వారా భార్య దేహంపై భర్తకు అధికారం (లైసెన్సు) సంక్రమించిందట. ఇలాంటి భాష్యంవల్ల వైవాహిక జీవితంలో భార్యలపై చాలామంది భర్తలు అత్యాచారాలు చేస్తున్నారు. దానిని సమాజం ఆమోదిస్తున్నది. ఇది అన్ని మతాల వారిలో జరుగుతున్న దమనకాండ. పరస్పర సమ్మతిపై, విశ్వాసంపై, సహనంపై, గౌరవంపై ఆధారపడవలసిన వైవాహిక జీవితం కలుషితం అవుతోంది. కొంతమంది శాడిస్టు భర్తలు భార్యలను హింసిస్తూ పెద్ద మనుష్యులుగా చలామణీ అవుతున్నారు. స్త్రీవ్యక్తిత్వానికి ఈ సంప్రదాయం గొడ్డలిపెట్టు. సంప్రదాయం పేరుతో, ఆచారం పేరుతో స్త్రీని కొరముట్టుగా, పనిముట్టుగా వాడుకునే పరిస్థితి కల్పించి ఆమె వ్యక్తిగత హోదాకు నష్టం చేకూర్చటం జరుగుతోంది.

(vii) నివాసపు హక్కు:-

ప్రతి వ్యక్తికీ శాంతి భద్రతల అవసరాలకు లోబడి తన ఇష్టం వచ్చిన చోట నివాసం ఏర్పరుచుకునే హక్కు కలిగి వుండగా స్త్రీలకు ఆ హక్కు నిరాకరింప బడుతున్నది. వివాహిత స్త్రీ అత్తింటికి కాపురానికి పోవలెనని, కనీసం భర్త కాపురం ఉన్నచోట నివసించాలని సంప్రదాయమూ, ఆచారమూ, అన్యాపదేశంగా చట్టాలు శాసిస్తున్నాయి.

భార్య ఉద్యోగం చేస్తూ భర్త కాపురం ఉన్న ఊరిలో కాక మరో ఊరిలో ఉద్యోగరీత్యా వుంటే కాపురానికి రమ్మనమని భర్త పిటీషను పెడ్తే ఒక హైకోర్టు భర్తకు అనుకూలంగా తీర్పు చెప్పింది. మరొక హైకోర్టు అలాంటి కేసులోనే భార్యకు అనుకూలంగా తీర్పు చెప్పింది. భర్తకు అనుకూలంగా ఇచ్చిన తీర్పును భార్య అమలు పరచక పోతే ఆమె ఆస్తిని అతడు జప్తు చేయించి వేలం వేయుటకు తేవడం ద్వారా ఆమెపై ఒత్తిడి తీసుకొని రావచ్చును. అపుడు ఆమె ఉద్యోగం వదులుకొని పరాధీనపు జీవితాన్ని గడపటానికి సిద్ధపడాలి. ఇది ఆమె హక్కుకు భంగకరం కాదా !

**(viii) హింస, చిత్రహింస, అవమానకరమైన శిక్షలకు ఏ మానవ వ్యక్తి లోనుచేయబడరాదు.**(5వఅధికరణం విశ్వమానవహక్కులుప్రకటన):-

దీనిని స్త్రీలకు అన్వయించి రాజ్యాంగ పరంగా దీనిని అంగీకరించడం జరిగింది. కాని సామాజికంగా దీనిని నిర్లక్ష్యంచేస్తున్నది పురుషలోకం. ఇది పితృస్వామ్య రాజ్యం. పురుషాధిపత్య సమాజం. కుటుంబానికి పెత్తందారు పురుషుడే. తండ్రిలేకపోతే భర్త లేక కుమారుడు వీరు కుటుంబయజమానులు. వారిదే ప్రతి విషయంలోను చివరిమాట. పెక్కుమంది భర్తలు భార్యలను దండించే రీతులు పలు విధాలుగా ఉన్నాయి. కొందరు తమ భార్యలను చిత్రహింసలకు లోనుచేస్తూంటే మరి కొందరు వారిని మానసిక హింసకు గురిచేస్తూ వారిని వ్యధల పాలు చేస్తున్నారు. కొందరు భార్యకు ఆహారం లభ్యం కాకుండా చేస్తే మరి కొందరు ఆమెకు విశ్రాంతిని నిరాకరిస్తున్నారు. ఇంకా కొందరు ఆమెను మానసికంగా చిత్రవధ చేస్తున్నారు. పలువురు భార్యలను శారీరకంగా హింసిస్తుంటే చుట్టుప్రక్కల వారు కలుగజేసుకోరు. ఏ సహృదయుడన్నా కలుగజేసుకుంటే 'నా భార్యను నేను కొట్టుకుంటాను, చంపుకుంటాను, ఇందులో జోక్యం కలుగ జేసుకోటానికి నీవు ఎవడవు?, అని ధీమాగా, లక్ష్య విహీనంగా జవాబు ఇస్తాడు. ఆ వైఖరిని ఇరుగూ పొరుగూ సమర్థిస్తారు. ఒక్కొక్కప్పుడు భార్య కూడా భర్త వైఖరికి వత్తాసు

పలుకుతుంది. ఒకవేళ ఆమె అలా చేయక పోతే కుమిలిపోయి ఆత్మ హత్యకు పాలుపడుతుంది. ఇది సర్వ సాధారణంగా జరుగుతున్న పని. భార్యను దండించే హక్కును భర్తకు ప్రసాదించాయి మత ధర్మ శాస్త్రాలు. ఎలాంటి బెత్తంతో - ఎంత మందపు పేము బెత్తంతో - ఆమెకు శారీరక శిక్ష విధించాలో కొన్ని మత ధర్మశాస్త్రాలు నిర్దేశించాయి. **స్త్రీకి కల శారీరక భద్రతా హక్కుకు భంగకరం.**

**(ix)** ప్రతి మానవుడు లేక మానవి 'లా' దృష్టిలో ఒక విశిష్ట వ్యక్తిగా పరిగణింప బడాలి. (అధికరణం 6 విశ్వమానవ హక్కుల ప్రణాళిక.) ఈ సూత్రం స్త్రీకూ వర్తించాలి. అంటే ప్రతి స్త్రీ ఒక వ్యక్తిగా లెక్కకు రావాలి. అంటే ఒకామె ఫలానా వారి కుమార్తెగానో లేక ఫలానా వారి భార్యగానో కాక ఫలానా పేరుగల వ్యక్తిగా గుర్తింప బడాలి. స్త్రీని కుమారి హేమా జయచంద్ర అనో లేక శ్రీమతి మంజులా మూర్తి అనో పిలవ నవసరం లేదు. పురుషుడి పేరును బట్టి అతనికి వివాహ మయినదో లేదో తెలియదు. అలాకాక స్త్రీ పేరును బట్టి ఆమె వివాహితా లేక అవివాహితా అని తెలుసుకోవలసిన అవసరం ఏమిటి? వివాహం స్త్రీకి తప్పని సరియైన సంస్కారమనే భావమా? లేక తండ్రియో లేక భర్తయో అండ దండగా ఉండక పోతే స్త్రీ బ్రతక లేదనే భావమా? పితృ స్వామ్య సమాజపు లక్షణంగా ఇది భాసిస్తున్నది. స్త్రీని వ్యక్తిగా గౌరవించలేని దుఃస్థితి ఇది.

## ఆర్థికం

i) స్త్రీకి ఉద్యోగ భద్రతకు హక్కు ఉండాలి. ఆమె సంతాన్ని కనే సందర్భంగా ఆమెకు తగినంత గడువు ప్రసూతి సెలవుగా ఇవ్వాలి. ప్రస్తుతం ఆరువారాలు మాత్రమే ఆమెకు సెలవుమీద జీతం లభిస్తున్నది. అది ఏ పరిస్థితులలోను మూడు మాసాలకు తక్కువ ఉండరాదు. అంతేగాక పిల్లలను పెంచడం తల్లిదండ్రుల ఇద్దరి బాధ్యత అయినా ఈ నాటి సమాజంలో కేవలం తల్లికి కేటాయించ బడుతున్నందున పిల్లలను పెంచే రోజుల్లో ఆమె

దీర్ఘకాలం సెలవుపై వెళ్ళవలసి వస్తున్నది. ఒక్కొక్కపుడు ఆమె చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా చేయవలసి వస్తోంది. లేక పూర్తి కాలపు ఉద్యోగం నుండి కొలదికాలపు ఉద్యోగానికి మారవలసి వస్తున్నది. దానివల్ల ఆమెకు వచ్చే ప్రమోషన్లు, ఇంక్రిమెంట్లు, ఇంకా ఇతర సౌకర్యాలు పోతున్నవి. క్రొత్త ఉద్యోగంలో ఒక్కొక్కపుడు తక్కువ జీతంపై చేరవలసి వస్తున్నది. సంతానాన్ని కనడం ద్వారా సామాజిక ప్రయోజనాన్ని సాధిస్తున్న మహిళకు ఇలా అన్యాయం చేయడం న్యాయసమ్మతం కాదు.

### ii) సమానమైన పనికి సమానమైన వేతనం

సమానమైన పనికి సమానమైన వేతనం స్త్రీ పురుష లిద్దరికీ చెందాలని విశ్వమానవ హక్కుల ప్రకటన లోని 23వ అధికరణం చెప్తున్నది. కాగా ఈ సూత్రం స్త్రీల పట్ల ప్రభుత్వ రంగాలలో మాత్రమే అనువర్తిస్తున్నది. వ్యక్తిగత వ్యాపార రంగంలో, కట్టుబడి లాంటి పనులలో ఈ సూత్రానికి భంగం కలుగుతున్నది. ఉదాహరణకు కట్టుబడి పనిలో రాళ్ళు, సున్నం మోసే కూలీలలో ఒకే పనికి స్త్రీలకు ఒక కూలీరేటు, పురుషులకు మరో కూలీ రేటు సంప్రదాయంగా ఉంటున్నాయి. ఈ సూత్రపు ఉల్లంఘన వల్ల స్త్రీలు తమ హక్కును కోల్పోతున్నారు. సమానమైన పనికి సమాన వేతనం ఇవ్వాలనే శాసనం ఆచరణలో మృగ్యమవుతోంది.

### (iii) ప్రతివ్యక్తి ఆస్తిని కలిగి ఉండటానికి హక్కుకలిగిఉన్నది.

ఆమె ఆస్తిని ఎవరూ బలవంతంగా లాగుకొనరాదు. ఈ హక్కును రాజ్యాంగం మొదట్లో మౌలిక హక్కుగా గుర్తించింది. తరువాత 1978లో వచ్చిన రాజ్యాంగ సవరణ వల్ల ఆస్తి హక్కు మౌలిక హక్కుల జాబితాలో నుండి తొలగింప బడింది. అది ప్రస్తుతం శాసన బద్ధమైన హక్కుగా మాత్రం ఉన్నది. అంటే ఒక పౌరుని ఆస్తిని ప్రభుత్వం ఏదో కొంత మొత్తం చెల్లించి ఆ వ్యక్తి స్వాధీనం తప్పించ వచ్చును. కాని ఒక వ్యక్తి ఆస్తిని ఆ వ్యక్తి సమ్మతి లేకుండా మరెవ్వరూ తీసుకొనరాదు. ఆమె స్వాధీనం నుండి తప్పించ రాదు.

స్త్రీల పరంగా అంగీకరింప బడిన ఈ హక్కు అమలు జరుపక పోగా ఉల్లంఘింప బడుతున్నది. ఇల్లాలు పేర ఆస్తి ఉంటే ధుమధుమ లాడి ఆమె ప్రాణాలనే హరించే పతిదేవులు, ఆమె సంపాదన మొత్తాన్ని కబళిస్తున్న భర్త నామధేయులు మన సమాజంలో కనుపిస్తున్నారు. లా ప్రకారం గుర్తింపు పొందిన హక్కు అనుభవంలో స్త్రీలకు కాకుండా పోతున్నది.

**(iv) ప్రతివ్యక్తికీ తనకూ తన కుటుంబానికి తగిన జీవన ప్రమాణాన్ని కలిగి ఉండటానికి హక్కు వుంది.** ఆహారం, బట్టలు, వైద్యం సామాజిక సేవలు మొదలగు అంశాలలో ఈ జీవన ప్రమాణ నిర్ధారణ జరుగ వలసి వుంది. (విశ్వమానవ హక్కుల ప్రకటన - అధికరణం 25) భారత దేశంలో ఇది మౌలిక హక్కుల జాబితాలో లేదు. కాగా ప్రభుత్వానికి ఇవ్వబడిన ఆదేశిక సూత్రాలలో చోటు చేసుకున్నది. అంటే దీని విషయమై స్త్రీ పురుషులు ఇరువురూ కోర్టుకు వెళ్ళి తమ హక్కును అనుభవంలోకి తెచ్చుకోడానికి వీలులేదు. స్త్రీల పరంగా ఆలోచిస్తే ఆహారం, వైద్యం, వస్త్ర సౌకర్యం, మొదలుగా గల విషయాలలో కుటుంబంలోని స్త్రీలది చివరి వంతుగా ఉంటున్నది. ఉన్న కాస్త ఆహారం భర్తకూ పిల్లలకూ పెట్టి కుండ కడిగిన నీళ్ళను త్రాగి తృప్తి పడటం గ్రామీక కుటుంబాలలో తరుచుగా జరిగే సంఘటన. వైద్యం, వస్త్ర వసతి మొదలుగా గల అంశాలలోనూ అదే వరస.

## సాంస్కృతికం

**(i) భావ స్వాతంత్ర్యానికి, ప్రకటనా స్వాతంత్ర్యానికి భారత రాజ్యాంగపు మౌలికహక్కుల జాబితాలో చోటున్నది.** సమాచార స్వాతంత్ర్యాన్ని స్పష్టంగా పేర్కొన్నది విశ్వమానవ హక్కుల ప్రకటన **19వ** అధికరణం. ఇది స్త్రీలపట్లకూడా వర్తిస్తుంది. కాని ఆచరణలో అది వమ్ము అవుతున్నది. కుటుంబాలలో స్త్రీలు అభిప్రాయాలు వెలువరించటానికి అవకాశాలు చాలా తక్కువ. భావ ప్రకటనను సమాజం హర్షించటం లేదు. కుటుంబం యొక్క అభిప్రాయాలను వెలిబుచ్చటానికి యజమానియైన పురుషుడే అర్హుడు అవుతున్నాడు.

(ii) విద్యా సముపార్జనకు స్త్రీ పురుషులకు హక్కు ఉన్నట్లు విశ్వ మానవ హక్కుల ప్రకటనలో 26 వ అధికరణం స్పష్టీకరిస్తున్నది. కాని భారత రాజ్యాంగపు మౌలిక హక్కుల జాబితాలో అది పేర్కొన లేదు. కాగా వివక్ష పనికి రాదని వ్రాయబడి ఉన్నది. 14వ ఏడు వరకు విద్యను నిర్బంధంగా పౌరులకు సమకూర్చాలని ఆదేశిక సూత్రాలలో వ్రాయబడి ఉంది. 'లా' దృష్టిలో పురుషుల కున్న హక్కు స్త్రీలకూ వుంది. కాని సామాజిక పరమైన భావనల దృష్ట్యా స్త్రీలకు ఆ హక్కులను అమలులోకి తెచ్చుకోవడం కష్టసాధ్య మవుతున్నది. బహు సంఖ్యాకులలో స్త్రీలకు చదువు అక్కర లేదనే భావం ప్రబలంగా ఉంది. అంతేగాక స్త్రీ పురుషులలో ఏ ఒకరికో ఇద్దరికో మాత్రమే కుటుంబం చదువు చెప్పించగల స్తోమతు కలిగి ఉంటే ఆ అవకాశం పురుషులకు ఇవ్వడం జరుగుతున్నది. స్త్రీలకు విద్య గడించే స్వేచ్ఛ ఉన్నది కాని దానిని అనుభవించడానికి అవకాశాలు సమాజంలో చాలా తక్కువగా ఉన్నాయి.

### (iii) సాంస్కృతిక జీవితంలో పాల్గొనే హక్కు

సమాజపు సాంస్కృతిక జీవితంలో పాల్గొనటానికి ప్రతి వ్యక్తికీ హక్కు ఉన్నది (విశ్వమానవ హక్కుల ప్రకటన 27 వ అధికరణం). దీని విషయమై భారత రాజ్యాంగం సదుపాయాలు కల్పించక పోయినా అడ్డంకులు కలుగజేయలేదు. ఇది స్త్రీ పురుషు లిద్దరికీ సామాన్యమైన హక్కు కాగా గ్రామిక వర్గ పురుషులకు ఈ హక్కు అందుబాటులోకి రావటం లేదు. ఇకపోతే సమాజపు సంప్రదాయాలు, ఆచారాలు విధించే ఆంక్షలవల్ల, నిషేధాల వల్ల ఉన్నత వర్గం లేక ధనిక వర్గంలోని స్త్రీలకు కూడా సమాజపు సాంస్కృతిక జీవితంలో భాగస్వామ్యం వహించే అవకాశం ఇంచుమించుగా లేనట్లే. ఇటీవల నృత్యం, నాట్యం విషయంగా కొంత సడలింపు వచ్చినా లలిత కళలను స్త్రీలు అభ్యసించటానికి, చేపట్టటానికి, వాటిని వృత్తిగా అవలంబించటానికి అవరోధాలు అనేకం ఉంటున్నాయి. దరహం మీద చెప్పాలి వస్తే కుటుం బీకులైన స్త్రీలు నాటకాలలోకి నటులుగా రావటంలేదు. ముఖ్యంగా తెలుగు దేశంలో ఈ విషయం స్పష్టంగా గోచరిస్తుంది. రేడియోలో కూడా తన

భార్య శృంగార నాయిక పాత్ర వహిస్తే సహించలేని భర్తలు, తన తల్లి నటిస్తే భరించలేని సంతానమూ కనిపిస్తున్నారు. ప్రేక్షకులుగా, శ్రోతలుగా ఉన్నంత మాత్రాన సాంస్కృతిక జీవితంలో పాలు పంచుకొన్నట్లు భావించ రాదు. అదీగాక ఇచ్చట మరో అంశాన్ని గుర్తుంచుకోవాలి. ఇంటిపనులలో సతమతమయ్యే స్త్రీ 'పతిదేవుని' పాద దాసిగా ఐండ చాకిరి చేసే అతివకు సంగీతాన్ని అభ్యసించటానికి, చిత్ర లేఖనాన్ని సాగించటానికి, కవిత్వం చెప్పటానికి అవకాశం మృగ్య మవుతోంది. శాసన రీత్యా ఆ సంబంధమైన స్వేచ్ఛకు ఆటంకాలు లేకపోయినా సమాజపు సంప్రదాయాలు ఆ హక్కును వినియోగించు కోకుండా స్త్రీని అటకాయిస్తున్నాయి.

**(iv) ఇంటిలో, కుటుంబంలో స్త్రీ చేస్తున్న పనికి పరిగణన లేమి; విశ్రాంతికి హక్కు:**

స్త్రీలు ఇంటా బయటా పని చేయక తప్పడంలేదు. సంపాదనకోసం పొలాలలో, తోటలలో, ఫ్యాక్టరీలలో పనిచేసే స్త్రీలు, అఫీసులలో, విద్యాలయాలలో పనిచేసే స్త్రీలు సైతం ఇంట్లో వంట, గృహ నిర్వహణ లాంటి విధులు నిర్వర్తిస్తున్నారు. ఇంటి పనికి వారు రోజుకు మూడు, నాలుగు గంటల వరకు తమ సమయాన్ని వినియోగిస్తున్నారు. దీనికి వారికి అదనంగా ఏ పారితోషికం లభించడం లేదు సరికదా ఆపని వారి వంతు బాధ్యత అయినట్లుగా పురుషపక్షపాతులు కొందరు మాట్లాడుతున్నారు. స్త్రీ నుదిటిమీద వంట, వంట, వంట అని మూడుసార్లు బ్రహ్మదేవుడు వ్రాశాడని హిందువులలో సంప్రదాయ వాదులు ప్రసంగించడం కద్దు. శ్రామిక స్త్రీలపైన, ఉద్యోగినుల పైన ఈ అదనపు భారం వేయడం సబబా అని ఆలోచించటం మానివేసింది పురుష ప్రపంచం. అంతేకాక పిల్లలను పెంచడం తల్లి దండ్రులిద్దరి కర్తవ్యం అనే విషయాన్ని విస్మరించటం జరుగుతోంది. ఈ సమస్యకు పరిష్కార మార్గం కనుగొనాలి. ప్రతి వ్యక్తికీ తీరిక, విశ్రాంతి పొందటానికి హక్కు ఉన్నదని విశ్వమానవ హక్కుల ప్రకటన పేర్కొన్నది. (24వ అధికరణం). ఈ సమస్యకు పరిష్కారం ఒక విధంగా మాత్రమే సాధ్యం. ఆలుమగలు ఇంటి పనిని, పిల్లల పెంపకాన్ని చెరి సగం చేసుకోవడం అవశ్యంగా జరగాలి.

## రాజకీయంగా:-

రాజకీయంగా భారత రాజ్యాంగం స్త్రీలకు హక్కులను నిరాకరించటం లేదు. వోటు హక్కు ఉన్నది. ప్రజా ప్రతినిధిగా పోటీ చేసే వెసులుబాటు ఉన్నది. ప్రభుత్వ యంత్రాంగంలో ఉన్నత పదవులను అధిష్ఠించటానికి అడ్డంకులు లేవు.

ప్రత్యక్షంగా కాని లేక ఎన్నుకో బడిన ప్రజా ప్రతినిధుల ద్వారా గాని జరిగే దేశ ప్రభుత్వంలో ( INDIAN GOVERNMENT ) పాల్గొనటానికి ప్రజలందరికీ హక్కులున్నాయి. అలాగే ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రవేశం పొందడానికి- తగిన అర్హతలుంటే - ప్రతి పౌరునికీ హక్కువున్నది. (విశ్వ మానవ హక్కుల ప్రకటన 21 వ అధికరణం). ప్రభుత్వ సర్వీసులలో, ప్రజారంగంలో ఉద్యోగంలో నియమింప బడటం విషయంగా స్త్రీలకు రాజ్యాంగ రీత్యా, శాసన రీత్యా ఆటంకాలు లేనిమాట నిజమే. కాగా ఇన్ని వేల సంవత్సరాలుగా విద్యకు, ప్రజా పరిపాలనా రంగానికి దూరంగా ఉంచ బడి నందువలన ఇటీవలగానే స్త్రీలు ఈ రంగాలలోనికి ప్రవేశించటానికి చొరవ చూపిస్తున్నారు. పురుషాధిక్య సమాజంలో స్త్రీల చొరవను, ప్రవేశాన్ని హర్షించని, అమోదించని, ప్రోత్సహించ దలచని వారు ఎందరో ఉన్నారు. అందువలన స్త్రీలలో సమర్థులకు కూడ తగినన్ని అవకాశాలు రావటం లేదు. ప్రత్యేక అవకాశాలున్న ఏ కొద్ది మందో - ఇందిరా గాంధి లాంటి వారు - ఉన్నత స్థానాలను అలంకరించ కలుగుతున్నారు. వారి విషయాన్ని పరిగణన లోకి తీసుకుంటే అది వారి వారి ప్రత్యేక విశిష్ట స్థానం వల్ల లభ్యమయిందే తప్ప మరేమీ కాదు. స్త్రీ అయినా, పురుషుడైనా అది అలాగే జరిగి వుండేది. కనుక అలాంటి సంఘటనలను పురస్కరించుకొని, అలాంటి వారి విజయాలను పేర్కొని స్త్రీలందరికీ సమాజంలో తగినన్ని అవకాశా లున్నాయని ధ్రువీకరించుట సాహస మవుతుంది. రాజకీయ పార్టీలలో, రాజకీయ సంస్థలలో, అమాటకు వస్తే అన్ని ప్రజా సంస్థలలో, ప్రభుత్వ యంత్రాంగంలో, మంత్రి పదవులలో, న్యాయ స్థానాలలో కీలక పదవులలో, స్థానాలలో మనం స్త్రీలను చూడటం లేదు. కారణాలను చిత్త

శుద్ధితో, నిజాయితీగా, నిష్పక్ష పాతంగా, పరిశీలించ గలగాలి. అప్పుడు సమాజంలో స్త్రీ జనాభ్యుదయం యెడ పేరుకొని పోయిన, ఘనీభవించిన దురవధి ప్రాయ సంచయం బయట పడుతుంది.

ఇది స్థూలంగా స్వేచ్ఛకు సంబంధించిన హక్కుల పరిశీలన.

13. ఇక సమానత్వ సందర్భంగా స్త్రీల హక్కుల విషయం ఆలోచిద్దాం. శాసనం దృష్టిలో అందరూ సమానులు. అందరికీ శాసనం సమానంగా రక్షణ ఇవ్వాలి. వివక్ష ఏ పరిస్థితిలోనూ కూడదు. లైంగిక భేదాలను బట్టి వివక్షను పాటించరాదు. (విశ్వమానవ హక్కుల ప్రకటన 7 వ అధికరణం) ఇలాంటివే భారత రాజ్యాంగ 14, 15 అధికరణాలు. హుందా విషయంగా, హక్కుల పరంగా అందరూ సమానులు. వారిలో ప్రతి ఒక్కరిలో హేతు త్వము, అంతఃప్రవృత్తి (CONSCIENCE), నైతికత ఉన్నాయి. వారం దరూ పరస్పరం సౌభ్రాతృత్వ భావనతో మెలగాలి. (విశ్వమానవ హక్కుల ప్రకటన 1వ అధికరణం.)

ఈ సమానత్వం అమలులోకి రావాలని ప్రతిపౌరుడూ కోరతగును. స్త్రీలూ అలాంటి హక్కుకు దూరం కాకూడదు. స్త్రీ పురుషులు ఇద్దరూ సమానులు. శారీరక నిర్మాణం విషయంలో స్త్రీ పురుషుల మధ్య కొంత తరతమ భేదం ఉన్నా మానసిక శక్తులకు సంబంధించి, బుద్ధి కుశలతను పరిగణనలోకి తీసు కుంటే, ఉద్యోగ పరమైన అంశాల సందర్భంగా, ఇతరత్రా స్త్రీ పురుషుల మధ్య వ్యత్యాసం లేదు; ఉండ వీలులేదు. ఈ అంశాన్ని గుర్తించుకోవటం అత్యావసరం.

(i) కుటుంబ యజమానిగా ఉండే హక్కు :-

స్త్రీ పురుషులు సమానులైనప్పుడు పురుషుడే కుటుంబ యజమానిగా ఉండనవసరంలేదు. కుటుంబంలోని సభ్యులు-కనీసం వయోజన సభ్యులు-సమా నులు. కనుక సమర్థతను బట్టి, చిత్త స్థైర్యాన్ని లెక్కలోకి తీసుకొని, నాయకత్వ లక్షణాలను గుర్తించి ప్రవర్తిస్తే భార్యా భర్తలలో భార్య కుటుంబ యజమానిగా ఉండవచ్చును. విడాకులు పొందిన స్త్రీ, విధవరాలైన స్త్రీ తన

సంతానంతో కలిసి జీవిస్తుంటే ఆమె కుటుంబ యజమానిగా ఉండటం వేరు. భర్త నిరుద్యోగి అయినా, భార్య ప్రజ్ఞావంతురాలు సంపాదన పరురాలు అయినా భర్తయే కుటుంబ యజమాని అవటం మనం చూస్తున్నాం. భార్య సంపాదనపై లా ప్రకారం రాజ్యాంగం ప్రకారం భర్తకు హక్కు లేకపోయినా భార్య తన సంపాదనను భర్త పాదాల దగ్గర కాకపోయినా జేబులో పెట్టడం మనం గమనిస్తున్నాం. ఇలా సమానత్వ సిద్ధాంతం వీగిపోతున్నది.

(ii) వారసత్వం

హిందూ సమిష్టి కుటుంబానికి పిత్రార్జితపు ఆస్తి ఉంటే దానిలో కుమారులకు జన్మతః హక్కు ఏర్పడుతున్నది. కుమార్తెలకు అది లేదు. ఇది ఆంధ్రప్రదేశ్ మినహా భారత దేశం అంతటా చలామణీ అవుతున్న న్యాయ పద్ధతి. ఆంధ్రప్రదేశ్‌లో 1986 లో కుమార్తెలకు పుట్టుకతో హక్కు ఇచ్చింది తెలుగుదేశం ప్రభుత్వం. ఆ హిందూ వారసత్వ సవరణ శాసనానికి భారత రిపబ్లికు అధ్యక్షుని అనుమతి లభించింది. ఒక మహమ్మదీయుడు చనిపోతే, భార్య, కుమారులు, కుమార్తెలు అతనికి వారసులయితే కుమార్తెకు వచ్చే వాటా కుమారునికి వచ్చే వాటాలో సగభాగం. పార్శీలలో కుమారునికి వచ్చే వాటాలో కుమార్తెకు సగం వాటా మాత్రమే వస్తుంది. ఇలా సమానత్వం హుళక్కి అవుతున్నది.

(iii) సంరక్షకత్వం:-

బిడ్డను నవమాసాలు మోసి కని పెంచుతున్నది స్త్రీ. కాని తన సంతానానికి ఆమె గార్డియను కాదు. హిందూ, ముసల్మాను న్యాయ శాస్త్రాలు అలాగే శాసిస్తున్నాయి. హిందూ కుటుంబాలలో తండ్రి లేకపోతే తల్లి సహజమైన సంరక్షణ కర్త. ఈమాత్రం వెసులుబాటుకు కూడా ముస్లిం మాత నోచుకోలేదు. ఆమె సంతానానికి తండ్రి, తండ్రిచే వీలునామాలో పేర్కొనబడిన అతడు, తండ్రి తండ్రి, లేక తండ్రి తండ్రిచేత వీలునామాలో నియమింప బడినవాడు వరుసగా గార్డియనులు అవుతారు. ఇంకెక్కడి సమానత్వం ?

(iv) దత్తత చేసుకోవడం :-

హిందువులలో దత్తత ఉంది. ముసల్మాను క్రైస్తవ సమాజాలలో దత్తత లేదు. పిల్లలను పెంచుకోవడం ఉంది. కాగా హిందూ సమాజంలో దత్తత జరిగేది పురుషునికి మాత్రమే. 1956 శాసనం ప్రకారం దత్తు చేసుకోడానికి స్త్రీకి హక్కు కలిగినమాట వాస్తవమే. ఏ పురుషుడూ భార్య సమ్మతి లేకుండా దత్తు చేసుకోరాదని వ్రాయబడి ఉన్నదనే విషయం నిజమే. అయితే ఒకటి మాత్రం సత్యం. వివాహిత స్త్రీ తన భర్త సమ్మతితోనైనా సరే దత్తు చేసుకోవటానికి అవకాశం లేదు. ఇది స్త్రీ పురుష సమానత్వానికి పూర్తిగా వ్యతిరేకమని స్త్రీల హోదాను గురించి దర్యాప్తు జరిగిన ప్రభుత్వ కమిటీవారు అభిప్రాయం వెలిబుచ్చారు.



(v) వరకట్న సమస్య :-



ఈ సమస్యను అనేక దృక్కోణాలనుండి అధ్యయనం చేయవచ్చును. అయితే మనం ఇక్కడ గమనించేది సమానత్వ దృక్పథం నుంచి మాత్రమే. స్త్రీ పురుషులు సమానులయినపుడు, వివాహం వధూవరు లిద్దరికీ అవసరమయినప్పుడు, శ్రామిక వర్గ స్త్రీలు సంపాదించగల శక్తి గల వారయినప్పుడు, అలాగే మధ్యతరగతి స్త్రీలలో పెక్కుమంది ఉద్యోగినులుగా జీతాలు పొందుతున్నప్పుడు, ధనిక వర్గాల స్త్రీలు ఆస్తులతో వస్తున్నపుడు, స్త్రీ పెండ్లి కుమారునికి వరకట్నం ఎందుకు ఇప్పించాలి? మగనిని ఎందుకు కొనుగోలు చేసుకోవాలి? ఆడపిల్లను కన్నందుకు మామకు అల్లుడు వేసే జరిమానా కట్నం అని ఒక ప్రఖ్యాత కవి పుంగవుడు నిర్వచించాడు. స్త్రీ తల్లిదండ్రులకు ఎందుకీ శిక్ష? సమానత్వ సూత్రం ఇలా ఉల్లంఘింపబడటం అన్యాయంకాదా?



ఆర్థికం:-

(i) ఇంటిపని, పిల్లల పెంపకం వగైరాలు:-

ఈ రెండు పనులు స్త్రీలకు మాత్రం కేటాయించడం, ప్రాథమిక స్థాయి ఉపాధ్యాయినులుగా, నర్సులుగా, చిన్నతరగతి ఉద్యోగినులుగా, టైపిస్టులుగా,

సైనోలుగా మాత్రమే స్త్రీలను నియమించడం సమానత్వ సిద్ధాంతానికి భిన్నం. విసుగు జనించే పనులు, మార్పు లేకుండా చేసే పనులు, తక్కువ జీతం వచ్చే ఉద్యోగాలు వీటికి స్త్రీలే తగుదురని మెచ్చుకోలు వాక్యాలు పలికి స్త్రీలను వాటిలో నియమించడం జరుగుతున్నది. తతిమ్మా ఉద్యోగాల విషయంలో కనపడని వివక్ష కొనసాగుతున్నది. ఉద్యోగాల నియామకం, ట్రెయినింగుకు ఎంపిక, ప్రమోషనుకు అభ్యర్థుల జాబితా నిర్ణయించడం వీటి విషయాలలో వివక్ష కొట్టవచ్చినట్లు కనపడుతోంది. ఇది జీవితానుభవం. న్యాయశాస్త్ర సూత్రాలకు విరుద్ధం. రాజ్యాంగ నిర్ణయాలకు వ్యతిరేకం.

### (ii) ప్రభుత్వ సహాయ సందర్భంగా :-

పేదలకు ప్రభుత్వం ఇళ్ళు కట్టించి ఇస్తున్నది; ఇళ్ళ స్థలాలు ఉచితంగా ఇస్తున్నది. పశుపతి సౌకర్యాలు కలిగిస్తున్నది. ఈ సహాయాలు అందరు పేదపురుషులకు అందటం లేదనే మాట వాస్తవమే. కాని ప్రస్తుత చర్చనీయాంశం అదికాదు. వాటిని కుటుంబ యజమానిగా పరిగణించబడే పురుషులకే ఇస్తున్నారు. కుటుంబానికి ఇల్లుగాని, ఇంటి స్థలం గాని ప్రభుత్వం దానం చేస్తున్నపుడు దానిని కుటుంబానికి ప్రాతిపదికగా ఉండే భార్యా భర్తలు ఇద్దరికీ ఇవ్వాలి కాని భర్త పేరనే ఇవ్వటం సమానత్వాన్ని కాంక్షించే స్త్రీ జనావళి యెడల వివక్ష కాక మరేమీ కాదు.

### (iii) స్త్రీలు సర్వ సాధారణంగా చేసే వృత్తులకు తక్కువ వేతనం :-

వ్యవసాయ కూలీలలో స్త్రీలు ఎక్కువ శాతంగా ఉన్నారు. కలుపు తీయడం, నాట్లు వేయడం, విత్తనాలు చల్లడం, తోటలలో పండ్లు, ఆకులు కోయడం, పొలాల్లో పత్తి, పొగాకు వల్లడం ఇలాంటి పనులను స్త్రీలు చేస్తున్నారు. కట్టుబడి పనిలో రాళ్ళు, సున్నం మోస్తున్నారు. ఎత్తైన మేడలు ఎక్కి సిమెంటు కంకర అందిస్తున్నారు. కాలువలు, చెరువులు త్రవ్వేటప్పుడు మట్టి తట్టలు మోస్తున్నారు. ఇలా ఎన్నో కష్టమైన పనులు చేస్తున్నారు. కాని స్త్రీలు చేసే పనులకు తక్కువ వేతనాలు ఇవ్వడం, పురుషులు చేసే పనులు హెరతో నెరపడం, త్రవ్వడం, వస్త్రాలకు ఎక్కువ

వేతనాలు ఇవ్వడం పరిపాటిగా సాగుతున్నది. సమానమైన పనికి సమానమైన వేతనం అనే సూత్రానికే ఇది అక్షరాల భిన్నం కాకపోయినా ఆ సూత్రపు మౌలిక గుణానికి వ్యతిరేకం. పైకి వివక్ష కన్పించకుండా చేసే కుతంత్రం స్త్రీలను తమతో సమానంగా చూడకుండా ఉండటానికి చేస్తున్న పన్నాగం.

## C సాంస్కృతికం:-

### (i) విద్య

స్త్రీ పురుషులు సమానమని అంగీకరిస్తే వారు వారి సమర్థతను బట్టి విద్యను అభ్యసించటానికి వీలుండాలి. అది వారి మానవ హక్కు. కాని అది వమ్ము చేయబడుతున్నది. తన భార్య తనకన్నా ఎక్కువ విద్యావంతురాలయినా, ప్రతిభావంతురాలయినా, సమర్థురాలయినా, పెద్ద ఉద్యోగం చేస్తున్నా, ఎక్కువ జీతం సంపాదిస్తున్నా సహించలేని భర్తలు సమాజంలో 100కి 90 మంది ఉన్నారు. ఈ పురుష వైఖరిని గుర్తించిన వారు - తల్లులు సైతం - తమ కుమార్తెలకు వివాహం కాదని పెద్ద చదువులు చదివించటం మానివేస్తున్నారు. అంతేకాదు. వివాహ మయిన తరువాత భర్త పరీక్షలో ఉత్తీర్ణుడు కాకపోతే, భార్య పాసయి పైచదువులు చదవ దలుచుకున్నా ఆమె చదువును మాన్పించడం తరుచుగా జరుగుతున్న సంఘటన. స్త్రీ పురుష సమానత్వం పెక్కుమంది పురుష పుంగవులకు కొరుకుడు పడకుండువలననే ఇలాంటి ఘోరం జరుగుతోంది.

### (ii) సాహిత్యాభిరుచి, లలిత కళాభ్యాసం వగైరా :-

స్త్రీలు సమాజ సాంస్కృతిక జీవనంలో భాగస్వామ్యం పొందటానికి అవరోధాలు సూత్రప్రాయంగా లేనిమాట నిజమే. కాని స్త్రీలు సంగీత విద్వాంసులుగా, చిత్రకారులుగా, నటులుగా, కవులుగా, సాహిత్య విమర్శకులుగా, శిల్పులుగా, రూపొందటానికి కుటుంబంలోని పురుషులు ఆటంకం కల్గించే రీతి విచిత్రంగా ఉంటుంది. వారికి అవకాశం ఇవ్వరు తండ్రి, భర్త. సమర్థులైన స్త్రీలను నిరుత్సాహ పరుస్తారు. అసమర్థులైన పురుషులను, అభినివేశం లేని మగవారిని, ప్రోత్సహిస్తారు. ఇదంతా అసమానత్వానికి నిదర్శనం.

## D రాజకీయం

### (i) నాయకత్వంలో స్థానం :-

ఉద్యమాలలో విప్లవాలలో స్త్రీలు పాల్గొంటున్నారు. త్యాగాలు చేస్తున్నారు. రక్తతర్పణం చేస్తున్నారు. కాని తీరా విప్లవాలు ఫలించి, తిరుగుబాటుదారులు జయించి స్వాతంత్ర్య పోరాటాలు నూతన రాజకీయ పార్టీలు పాలక పార్టీలుగా తయారయి ప్రభుత్వాలను నిర్మించినపుడు వాటిల్లో పాల్గొని ప్రముఖ పాత్రలను నిర్వహించిన స్త్రీలకు కీలక స్థానాలు దక్కటం లేదు. మహిళా సంక్షేమం, శిశు రక్షణ, ఆరోగ్యం లాంటి మంత్రివర్గ శాఖలను స్త్రీలకు అప్పగించటం జరుగుతున్నది. ఆంతరంగిక శాఖ, విదేశాంగ శాఖ, ఆర్థిక శాఖ వారికి అందుబాటులో ఉండవు. పొలిట్ బ్యూరోంలో, కేంద్ర కార్యాచరణ సమితులలో వారికి స్థానం ఉండదు. ఇదంతా సమర్థత, అసమర్థత అనే గీటు రాయి పైన చేయబడిన నిర్ణయాలు కావు. స్త్రీజన వ్యతిరేకతతో సాగే ఆలోచనం ఫలితాలు రాజకీయ పార్టీలు అభ్యర్థులను ఎన్నుకునే సందర్భంలో కూడా ఇలాగే జరుగుతోంది. గెలుపుకు అవకాశం లేని రాజకీయ పార్టీలు కూడా స్త్రీలను అభ్యర్థులుగా పెట్టటానికి వెనుకాడుతున్నాయి. "ఓడిపోయే టప్పుడు ఎవరైతేనేమి ? స్త్రీలు ఓడిపోయే అభ్యర్థులుగా కూడా ఉండటానికి అర్హులు కారా ?" ఈ రకమయిన ప్రశ్నలు వస్తే పురుషాధిక్య సమాజంలో పుట్టి పెరిగిన పెద్దలు మౌనం వహించటం తప్ప మరేమీ చేయలేరు. రాజకీయాలలో స్త్రీ పురుష వివక్ష సాగుతున్నదనే విషయాన్ని నొక్కి చెప్పటానికే ఇంత వివరణ కావలసి వచ్చింది. 'లా' దారి 'లా'ది. ఆచరణ దారి ఆచరణది. రెంటికీ పొంతన ఉండటం లేదు.

### ii) ఓటుహక్కు:-

స్త్రీలకు ఓటు హక్కు వచ్చింది 1921 ప్రాంతంలో. కాగితం మీద వివక్షలేదు. కాని ఆచరణలో స్త్రీలు భర్తల ఇష్టప్రకారం, తండ్రుల ఆజ్ఞను అనుసరించి, కుమారుల ఆదేశాలను పాటించి ఓటు వేస్తున్నారనేది నిర్వివాదాంశం. దీనికి భిన్నం ఒక్క 1971లో లోకసభ ఎన్నికల్లో జరిగింది. దానికి ముందూ, తర్వాత కూడా స్త్రీల ఓట్లు వారివి కావు.

ఏనాడూ వారు స్వతంత్రించి వారి వోట్లను వారు స్వేచ్ఛగా వేయలేదు. అసలు స్త్రీలను వోట్లు అడగరు. 'మీ ఇంట్లో ఉన్న వోట్లు నాకిప్పించు రామయ్యా !' అని అభ్యర్థి కోరతాడు. రామయ్య వోటు, అతని భార్యవోటు, అతని తల్లివోటు కలసి మూడూ రామయ్యకు చెందిన వోట్లన్నమాట. వోటు హక్కును రాజ్యాంగం ఇచ్చింది కదా అని ప్రతివాదన చేసి లాభంలేదు. రాజ్యాంగం స్థిరపరచిన ఆ ప్రజాస్వామ్య హక్కులను సమాజం తన ఆచరణ ద్వారా కాలరాస్తోంది. పురుషులకు వోటు వేసే హక్కు, స్త్రీలకు వోటును వినియోగించుకోలేని స్థితి కల్పించడం అసమానత్వ ప్రదర్శనం మాత్రమే.

స్త్రీల హక్కులను స్వేచ్ఛా సమానత్వాల ప్రాతిపదికగా విశ్లేషించడం, అవి ఎంతవరకు ఆచరణలోకి వస్తున్నాయో గమనించడం జరిగింది. ఈ అధ్యయనం వల్ల ఈ అంశాలు తేలుతున్నాయి.

(i) కొన్ని సందర్భాలలో స్త్రీలు పురుషులతో పాటు అనేక హక్కులను అనుభవించలేక పోతున్నారు. ఉదాహరణకు ఉద్యోగం పొందే హక్కు ప్రజలకు లేదు; కనీస జీవన స్థాయిని అనుభవించడానికి అవకాశం లేదు. ప్రజా సంక్షేమాన్ని కాపాడే లక్షణాలు లేకపోవటమేకారణం.

(ii) రాజ్యాంగం ప్రసాదించిన హక్కులను కూడా స్త్రీలు అనుభవించ టానికి వీలులేకుండా కొన్ని మత ధర్మ శాసనాలు అవరోధంగా ఉన్నాయి.

(iii) శాసనాలు ప్రకటిస్తున్న హక్కులు కూడా స్త్రీల జీవితానుభవం లోకి రావటంలేదు. స్త్రీలకు వ్యతిరేకంగా వివక్ష ప్రదర్శింపబడుతోంది. సమాజం యొక్క పురుషాధిక్యతా స్వభావం దానికి కారణభూతం అనేది పచ్చి నిజం.

ఈ పరిస్థితిని మార్చటానికి ఈనాడు ఏం జరగాలి అనేది ముఖ్య సమస్య అయి మన ముందు కొచ్చింది.

(i) ఎవరైతే బాధపడుతున్నారో వారిలో జాగృతి కలగాలి అంటే స్త్రీలలో తమ శోచనీయ పరిస్థితి పట్ల వారికి అవేదన పుట్టాలి. ఈ పరిస్థితిని మార్చటానికి సంకల్పం ఉదయించాలి.

(ii) స్త్రీలు తమ హక్కులను విస్తరింప చేసుకోటానికి, తమ హక్కులను స్థిర పరుచుకోటానికి, కాపాడు కోటానికి, అనుభవం లోకి తెచ్చుకోటానికి వ్యక్తిగతంగాను, సంఘటితంగాను. కృషి చేయటానికి సంసిద్ధులు కావాలి. తమతమ ప్రత్యేక సంఘాల ద్వారా కృషి చేయాలి.

(iii) సమాజంలో సగ భాగమైన స్త్రీలు వెనుకబడి ఉంటే సమాజాభ్యుదయం సాగదనే విషయం గుర్తించిన పురుషుల సాయాన్ని తీసుకోడానికి స్త్రీలు సంకోచింపరాదు.

(iv) దళితులు, వెనుకబడిన వర్గాలు, గిరిజనులు, స్త్రీలు, శ్రామికులు వీరంతా కలసి కృషి చేస్తే మహిళాభ్యుదయం సులభ సాధ్యమని గ్రహించాలి

(v) స్త్రీ విమోచన భాగంగా లేని ఏ విప్లవమూ అభిలషణీయం కాదని స్త్రీలు అభ్యుదయ కాముకులకు నచ్చచెప్పాలి.

(vi) స్త్రీ విమోచన కార్యక్రమాన్ని వాయిదా వేసే ఏ ఇతర విప్లవ కార్యక్రమాన్నీ స్త్రీలు ప్రోత్సహించరాదు. స్త్రీ విమోచన కార్యక్రమమూ, ఇతర సామాజిక పరివర్తన ప్రణాళికా నిర్వహణ ఏక కాలంలో జరిగేటట్లు మహిళోద్యమ కార్యకర్తలు శ్రద్ధ వహించాలి. దాని విషయమై పట్టు పట్టాలి.

(vii) పురుషాధిక్యతా సమాజం పోయి సమ సమాజం ఏర్పడితే తప్ప, మనిషి మనిషిని దోచుకునే సంఘం నశిస్తే తప్ప, మానవుల మధ్య సహకార భావం పెంపొందితే తప్ప, స్వేచ్ఛా సమానత్వాలకై ఆరాటం, పోరాటం వృద్ధి అయితే తప్ప, స్త్రీలలో జాగృతి, లక్ష్యశుద్ధి సంఘటిత శక్తి, నిర్మాణ దక్షత, పోరాట పటిమ, పట్టుదల దినదిన ప్రవర్ధమైతే తప్ప స్త్రీల హక్కులకు రక్షణ ఉండదు. భద్రత ఉండదు.

ఈ అంశాలను గుర్తెరిగిన మహిళలు సమాజంలో తమకు హక్కుగా రావలసిన స్థానాన్ని పొందడానికి కృషి చేస్తారని ఆశిద్దాం.

# స్త్రీలకు ప్రత్యేక సమస్యలున్నాయా?

మల్లాది సుబ్బమ్మ

"పురుషులకు లేని ప్రత్యేక చిక్కులు స్త్రీలకు ఉన్నాయా?" అని ఒక మిత్రుని ప్రశ్న. అసలు స్త్రీలకు ప్రత్యేక సమస్యలు వున్నాయా? వుంటే అవి పురుషులకు సంబంధించినవి కావా? స్త్రీ బాగుపడితే పురుషుడూ, పురుషుడు బాగుపడితే స్త్రీ బాగా వున్నట్లే కదా? ఇద్దరి సమస్యలకూ అవినాభావ సంబంధం లేదా? ఇద్దరి సమస్యలూ ఒకటి కావా? వనితలు ఎదుర్కొంటున్న చిక్కులనే పురుషులు మరో రూపంలో ఎదుర్కోవటం లేదా? పురుషులంతా సుఖ సంతోషాలతో జీవిస్తున్నారా? ప్రత్యేకంగా స్త్రీలను గురించి ఎందుకింత "హంగామా" అని విమర్శించడం జరుగుతోంది. కనుక ఈ విషయంపై చర్చ జరగాలి.

ప్రకృతి స్వభావాన్నిబట్టి స్త్రీ పురుషులకు శారీరక, మానసిక పరిణామాలు ఎలా విభిన్నాలో వారి సమస్యలు సైతం వేరే. బాలురకు, యువకులకు, వృద్ధులకు వేరు వేరు సమస్యలెలా వుంటాయో స్త్రీ పురుషులకు వేరు వేరుగా సమస్యలు వున్నా స్త్రీలకు మాత్రం పురుషులకు లేని ప్రత్యేక సమస్యలు వున్నాయనేది నగ్న సత్యం. అంతస్తులలోను, గౌరవాదరాలలోను, స్త్రీ పురుషు లిద్దరికీ భేదం లేదన్న వాదన లాంఛన ప్రాయంగానే నిలిచి పోయింది. స్త్రీ పుట్టిన నాడి నుండి పరాధీనయే. పురుష దండన, పుత్ర దండన అనేవి ఆమె ఆజన్మాంతం అనుభవిస్తూనే వుంది. అలాంటివి అనేకం ఆచరణలో వున్నాయి. మన ఆచారాన్ని బట్టి స్త్రీ అత్తింటికి వస్తుంది కాపురానికి, కాని పురుషుడు అత్తింట్లో నివాస ముండడు కదా! బాల వితంతు వయినా ఆమె మళ్ళీ పెళ్ళాడితే ఆ వివాహాన్ని సంఘం గర్హిస్తుంది. అలాగే వ్యభిచారం జరిగితే తప్పంతా స్త్రీది గానే నిరూపిస్తారు. అలాగే ఒక కన్య తల్లి అయితే ఇక ఆ తల్లి చావాలి లేదా సంఘ బహిష్కృత అయినా కావాలి. భార్యాభర్తల ఆశయాలు వేరుగా వున్నప్పుడు భర్త లక్ష్యాలు నెరవేర్చటం సహజం.

ఇక రోజంతా ఆమె ఎంత చాకిరీ చేసినా పోషింపబడేది అతని మనిషే అవుతోంది. ఇంక విద్యకాని, ఉద్యోగం కాని ఆఖరికి బిడ్డలెందర్ని కనాలన్నా అన్నీ భర్త ఆజ్ఞలపై ఆధారపడి వుంటాయి. ఇలా ఎన్నో మరెన్నో వున్నాయి.

ఏదయినా స్త్రీలకు ప్రత్యేక సమస్యలు లేవని, వారి సమస్యలు మానవాళి సమస్యలలో భాగమని, వారి సమస్యల పరిష్కారానికి ప్రత్యేక కృషి అనవసరమని, వారి కోరికలు సాధించడానికి ప్రత్యేకంగా సంఘాల నిర్మాణం సాగించవలసిన అగత్యం లేదని కొందరు వాదిస్తుంటారు. ఇలా వాదించే వారిలో అనేక రకాల వారు ఉన్నారు. స్త్రీల శ్రేయస్సును కాంక్షిస్తూనే నిజాయితీగా నిర్మలమైన మనస్సుతో ఆలోచించేవారు మొదటిరకం. అలాకాక స్త్రీలు చైతన్యవంతులయితే, తమ హక్కులను తాము గుర్తిస్తే, తమ కోరికలను తాము వెలువరిస్తే స్త్రీలచేత పూర్వం చేయించుకున్నట్లే దాస్యం చేయించుకోలేమని భయపడి స్వార్థబుద్ధితో స్త్రీలకు ప్రత్యేక సమస్యలు లేవనే వారు రెండవ రకం. ఈ తరగతి వారి కుతంత్రాలను మనం వెలికి తీయాలి. తమకు వ్యక్తిత్వం ఉందనే విషయం గమనించక, తమ హక్కులేవో తమకు తెలియక, తమ అభ్యుదయానికి కావలసిన సాధన సంపత్తిని గుర్తించలేక సతమతమవుతూ అజ్ఞానాంధకారంలో మునిగి ఉండే స్త్రీలు మూడవ రకం. ఇందులో మొదటిరకం వారిని సహృదయంతో అర్థం చేసుకొని వారి వాదనలోని పసను పసిగట్టడానికి ప్రయత్నించాలి. మూడవ రకానికి చెందిన స్త్రీలను సానుభూతితో చూస్తూ వారికి విషయాలు తెలియజేయడానికి శ్రద్ధవహించాలి. ఇక స్వార్థ చింతనతో, కుయుక్తులతో, కుంటిసాకులతో, కుతర్కాలతో వాదనకు దిగి స్త్రీలను అన్యాయం చేయాలనే దుర్మార్గ ప్రవృత్తిగల పురుషులను ఎండ కట్టాలి.

ఇక అసలు సమస్యను పరిశీలిద్దాము. మానవాళిలో స్త్రీలూ, పురుషులూ ఉన్నారు. ఇరువురు ఒకరితో మరియొకరు సన్నిహిత సంబంధం కలవారు. స్త్రీలేని కుటుంబం, పురుషుడులేని కుటుంబం ఉండజాలదు. స్త్రీ పురుషుల కలయిక లేకపోతే మానవ జాతిలో సృష్టి ఆగిపోతుంది. కనుక వారిద్దరూ

ఒకరిపై మరొకరు ఆధారపడిన వారు. ఇరువురి సహకారంతో కుటుంబం, సమాజం నడుస్తున్నాయి. పైగా ఇరువురూ మానవ వ్యక్తులే. అంటే స్త్రీ ఒక వ్యక్తి అన్నమాట. అలాగే పురుషుడు. ప్రతి వ్యక్తికీ కొన్ని లక్షణాలు ఉంటాయి. ప్రతిజీవి బ్రతకాలని ఆశిస్తుంది. అందుకోసం ఆరాట పడుతుంది. చీమలు వానాకాలంలో తిండికోసం ముందుజాగ్రత్త వహిస్తాయి. ప్రతి పురుగూ, పిట్టా, జంతువు తమ శత్రువుల బారినుండి రక్షించుకోవటానికి అనేక విధాలుగా ప్రయత్నిస్తూ వుండటం మనం చూస్తూనే వుంటాం. కాగా మనిషికి మెదడు ఉంది. ఆలోచనా శక్తి ఉంది. ఉద్వేగాలు ఉన్నాయి. ఆవేశ కావేషాలు ఉన్నాయి. వీటిని వెలువరించటానికి భాష ఉంది. ముందు తరాల వారికి తమ భావాలను అందించటానికి అవసరమైన సాధన సంపత్తిని మనుష్యులు సంతరించుకున్నారు. ప్రకృతి శక్తులనుండి బాధలేకుండా చేసుకోవటానికి తమ దేహాలను మలుచుకొనే ఇతర జీవులవలె కాకుండా మానవులు ప్రకృతిని తమకు అనుకూలంగా మలుచుకుంటున్నారు. ఇలా తమ స్వేచ్ఛ కోసం, వ్యక్తిత్వ వికాసం కొరకు మానవులు శ్రమిస్తున్నారు. ఈ ప్రయత్నాన్ని అభ్యుదయంగా భావిస్తున్నాం.

ఒకరుగా అభ్యుదయం సాధించుకుంటే వ్యక్తిగత అభ్యుదయం అంటాం. అందరూ కలసి అభ్యుదయం వైపు పయనం సాగిస్తే సామాజిక అభ్యుదయం అంటాం. సామాజిక అభ్యుదయంలో స్త్రీ పురుషులు ఇరువురూ భాగస్వాములే.

కాగా సమాజంలో, కుటుంబంలో స్త్రీ పురుషుల హోదాను గురించి పలు అభిప్రాయాలు చలామణిలో ఉన్నాయి. శారీరక నిర్మాణం విషయంగా కొద్దిపాటి తేడాలు తప్ప తతిమ్మా అంశాలన్నింటిలో స్త్రీ పురుషులు ఆలోచనలలో, ఉద్వేగాలలో, శక్తి సామర్థ్యాలలో సరిసమానులను అభిప్రాయం మొదటిది. అలా కాక స్త్రీ ప్రకృతి వేరు, పురుష స్వభావం వేరు అనే భావం కొంత ప్రచారంలో ఉంది. దీనిని రెండవ వైఖరిగా పేర్కొన వచ్చును. ఈ భావాన్ని మహాత్మాగాంధి, రస్కిన్ ప్రభృతులు ఆమోదించి ప్రచారం చేశారు. అంటే దీని అర్థం ఏమంటే స్త్రీ పురుషులు సమానులే కాని వారి శక్తి

యుక్తులు వేరు వేరని. స్త్రీ ప్రకృతి జడ రూపమని, పురుష శక్తి చైతన్య వంతమని, కనుక స్త్రీ పురుషుని కన్న తక్కువ అని కొంతమంది ప్రచారం చేస్తున్నారు. ఇది మూడవ వైఖరి.

పై చెప్పిన మూడు వైఖరులలో చివరిది ఏమాత్రము ఆమోద యోగ్యం కాదు. పురుషులు చేస్తున్న పనులన్నింటిని-ఇంచు మించుగా స్త్రీలూ చేస్తున్నారు, తెలివి తేటలలో, దేహదారుఢ్యంలో, యంత్రాలను వాడే నేర్పరితనంలో, సృజనాశక్తిలో, కళానైపుణ్యంలో దేనిలోనూ-స్త్రీలు పురుషులకు తీసిపోవటం లేదు. అలాంటప్పుడు ఈ భావాన్ని అంటిపెట్టుకొని ఉండటంలో ఔచిత్యం లేదు. ఇక రెండవ వైఖరిని గురించి ఆలోచిద్దాం. పురుషుడు చేయలేని పని స్త్రీ చేస్తున్నది. గర్భాన్ని ధరించి, తొమ్మిది నెలలు మోసి, ప్రసవించి, తరువాత కన్నపిల్లకు పాలివ్వగల శక్తి కేవలం స్త్రీకే ఉన్న మాట వాస్తవం. అది ఆమె ప్రత్యేకత. పురుషుని కన్న ఆమెకు గల అదనపు శక్తి సామర్థ్యం. దానివల్ల మానవాళి మనుగడకు ఆమె దోహదం చేస్తున్నది, అందుకు ఆమెను పురుషులు అభినందించాలి. ఆమెకు ప్రత్యేక సౌకర్యాలు కలుగ జేయాలి. అంతేగాని ఆ కారణాన, దానిని సాకుగా తీసుకొని, ఆమెను నిష్క్రియా పరురాలని-అంటే ఏమీ చేయలేని దానినిగా-చేయరాదు. అది మానవాళికే అపచారం. అది కృతజ్ఞత లేకపోవడం. ఏరుదాటి తెప్ప తగుల వేసే మనస్తత్వం. ద్రోహం. కుత్సితం. ఈ సాకుతో ఆమెను వంట యింటికీ, పడకటింటికీ పరిమితం చేసి, ఆమెను దాస్య శృంఖలాలలో కట్టి పడవేసి ఆమెను మర బొమ్మగా తయారు చేయటం అన్యాయం. స్త్రీ జాతి యెడల అన్యాయమే కాక పురుషులకు కూడ ఆత్మ వినాశకరం. సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక రంగాలన్నింట తన సహచరి తనకు దీటుగా ఉండి, తనతో సహకరిస్తూ ఉంటే పురుషునకే లాభం. ఈ విషయాన్ని దూరదృష్టి గల పురుషులు గ్రహిస్తున్నారు. కేవలం ఈ రోజుతో పబ్బం గడపుకోవాలనే మనస్తత్వం గలవారు గుర్తించలేరు. వారు తామే నష్టపోతారు; పోతున్నారు.

స్త్రీ పురుషులు సమానులని అందరూ - ఈనాడు - ప్రజాస్వామ్య యుగంలో అంగీకరిస్తున్నారు. కొందరు లాంఛన ప్రాయంగా ఆమోదిస్తుంటే

పరికొందరు మనస్ఫూర్తిగా ఆ సూత్రాన్ని విశ్వసిస్తున్నారు. సంఘంలోనుండి కాక పైపైపుం మీదినుండి ఆ భావాన్ని వెలువరించే వారి సంఖ్య ఎక్కువగా ఉంటున్నది. వారు కుహనా తర్కంతో, తప్పుడు వాదనలతో స్త్రీ వ్యక్తిత్వాన్ని గుర్తించడానికి, ఆమె సమాన హోదాను అంగీకరించటానికి వెనుకాడుతున్నారు. వారి వాదనలను త్రోసిరాజన వలసి యున్నది.

స్త్రీ పురుషులు సమానులన్నారు కదా కనుక స్త్రీలకు ప్రత్యేకంగా పాయిఖానాలు అక్కరలేదు, ప్రత్యేకంగా సదుపాయాలు అక్కరలేదనే వారూ ఉన్నారు. ఇటీవల అమెరికా సంయుక్త రాష్ట్రాలలో స్త్రీ పురుషుల సమాన హక్కుల బిల్లును వ్యతిరేకిస్తూ కొందరు పురుషులు చేసిన వితండవాదన పైవిధంగా ఉంది. ఇది అక్కసుతో కూడిన దృక్పథం. స్త్రీలు సమానత్వం కోరుతున్నారనే బాధతో, వారిని ఇబ్బంది పెట్టాలని చేసే కుటిల యత్నం.

ఇకపోతే 'స్త్రీలకు ప్రత్యేక సమస్య లున్నాయా ?' అనే అంశాన్ని విడమర్చి విశదీకరించ వలసి ఉన్నది. వారి సమస్యలు అనేక విధాలుగా పుట్టుతున్నాయి. శారీరక నిర్మాణంలో గల భేదాలనుబట్టి, కుటుంబంలో వారి స్థితిగతులను బట్టి, సమాజంలో వారి హోదాను బట్టి, రాజకీయాలలో వారి ప్రవేశము, ప్రమేయం, భాగస్వామ్యం మొదలుగాగల అంశాల వల్ల, ఆర్థికంగా వారు పురుషులపై ఆధారపడి వుండవలసిన దుర్గతి వల్ల, సాంస్కృతిక రంగంలో వారికి ఉన్నతస్థానాన్ని యివ్వనందువల్ల అనేక సమస్యలు స్త్రీలకు ఉత్పన్న మవుతున్నాయి. వాటినిగురించి వివరంగా తెలుసుకోవటం అవసరం.

శారీరక నిర్మాణం విషయం పరికిస్తే పిల్లలను కనడానికి అనువైన పద్ధతిలో స్త్రీ శరీర నిర్మాణం ఉన్నది. గర్భిణీగా ఉన్నపుడు కొన్ని నెలలు ఆమెకు విశ్రాంతి అవసరం. అలాగే ప్రసవ కాలంలో ఆమె బరువు పనులు చేయటానికి వీలులేదు. ప్రసవానంతరం కొన్ని నెలలు ఆమె బండ పనులు చేయటం మంచిదికాదు. అంతేగాక పిల్లలను కనీసం సంవత్సరం వయస్సు వచ్చే వరకు ఆమె పిల్లలకు పాలివ్వవలసి ఉంటుంది. తల్లి పాలు డబ్బా పాల కన్న మంచివనే విషయం అందరూ ఒప్పుకుంటున్న విషయమే. అందువల్ల ఈసందర్భంగా సదుపాయాలు స్త్రీకి ఒనగూర్చ వలసి యున్నది.

అన్నిదేశాలకన్న స్వీడను దేశంలో కుటుంబ సంక్షేమ పథకాలు బాగా అమలు జరుగుతున్నాయి. స్త్రీకి ప్రసూతి సెలవులు మన దేశంలో ఆరువారాలు అయితే స్వీడనులో తొంభై రోజులు ఇస్తున్నారు. పిల్లలను పెంచ దానికి మన దేశంలో సెలవులు లేవు. స్వీడనులో పిల్లలను పెంచడానికి తల్లికి జీతంతో, జీతం లేకుండా, అర్ధజీతంతో సెలవలు ఇస్తున్నారు. అలాగే తండ్రికి కూడా కొన్ని రోజులు సెలవు ఇస్తారు. ప్రసవ సమయంలో భర్తకు జీతంతో ముప్పై రోజులు సెలవు ఇస్తారు. ఇలా సౌకర్యాలు సదు పాయాలు ఇవ్వడం జరుగుతున్నది. వీటి వివరాలజోలికి ప్రస్తుతం పోనవసరం లేదు. కాగా స్త్రీలకు ప్రసూతి సెలవులు, పెంచే కాలపు సెలవులు, తరువాత ఉద్యోగం చేస్తున్నపుడు పిల్లలకు పాలివ్వడానికి కాలవ్యవధి కేటాయించ బడటం, గర్భిణీ స్త్రీకి పోషకాహారపు సదుపాయం, ప్రసవ సందర్భంగా ప్రత్యేక ఆసుపత్రులు, నర్సింగు హోంలు ఇవి అన్నీ స్త్రీల ప్రత్యేక సమస్యలకు నిదర్శనం.

## కుటుంబ పరంగా :—

ఇకపోతే కుటుంబంలో ఆమె స్థానం వల్ల కలిగిన సమస్యలు. సమాజం వేటాడి ఆహారం సంపాదించుకునే రోజుల్లో స్త్రీ పురుషులు ఇరువురూ వేటకు వెళ్ళేవారు. ఇరువురూ సమానంగా బాధ్యతలు నిర్వహించేవారు. వ్యవసాయక దశలోకి సమాజం రావడంతో పరిస్థితులు మారాయి. పొలం దున్నడం పురుషుని వంతు అయింది. విత్తనాలు చల్లడం, కలుపు తీయడం, కోతలు కోయడం, నాట్లు వేయడం స్త్రీలకు కేటాయించడం జరిగింది. పని విభజన పేరుతో స్త్రీకి ఇంటిపని కూడా అప్పగించబడింది. ఆమె శారీరక ప్రత్యేకత – పిల్లలను కనడం – ఆసరాగా తీసుకొని ఆమెను ఇంటిపట్టున ఉంచాలనే ప్రయత్నం సాగింది. కాని ఇరువురూ పనిచేస్తే తప్ప పొట్ట గడవని దశలో బయట పని కూడా ఆమె చేయక తప్పలేదు. అలా ఆమె ఇంటిపని, బయటపని రెండూ చేయవలసి వచ్చింది. ఇంటిపని స్త్రీయే చేయాలనే పద్ధతి సర్వే సర్వత్రా అమలులో ఉంది. ఇది స్త్రీపై అదనపు భారాన్ని మోపుతున్నది.

భారత దేశంలో స్త్రీ వివాహమయిన తరువాత అత్తింటికి కాపురానికి వెళ్తుంది. పుట్టిన చోటునుంచి తరలి మెట్టిన ఇంటిలో కాపురం చేస్తుంది.

సమిష్టి కుటుంబాలలో అత్త పోరును, ఆడబిడ్డ ఆరళ్ళను ఆమె అనుభవిస్తున్నది. ఈబాధ పురుషులకు లేదు.

పిల్లలను పెంచే బాధ్యత స్త్రీకి కేటాయించడం జరిగింది. నిజానికి పిల్లలను కనడం వేరు, పిల్లలను పెంచడం వేరు. పిల్లలను స్త్రీ మాత్రమే కనగలదు. కాని పిల్లలను తండ్రి కూడా పెంచగలడు. ఈ బాధ్యతను స్త్రీకి మాత్రమే అప్పచెప్పటం వల్ల ఆమెకు పని బరువు ఎక్కువ అవుతున్నది. ఈ సమస్య మరి పురుషులది కాదు. కేవలం స్త్రీలదే.

వంటపని ఇంటిపనిలో భాగమయినా వంటపనిని ప్రత్యేకంగా పేర్కొ-నాలి. వంటపని చేయడానికి పురుషుడు ముందుకు రాడు. వంటచేయడం వృత్తిగా ఉన్న పురుషుడు కూడ ఇంటిలో భార్యన్నే వండి వార్చమంటాడు. ఉద్యోగినియై లేక పారిశ్రామికురాలయి భర్తతో ఇంచుమించుగా సమానంగా సంపాదిస్తున్నా ఆమెకు వంటపని తప్పదు. ఆడదానికి వంట, వంట. వంట అని మూడుసార్లు నుదుట రాశాడని ఎగతాళిగా మాట్లాడతారు పురుష పుంగవులు. ఇది స్త్రీలకు ఉన్న ప్రత్యేక బాధ కాక మరేమిటి ?

ఇంట్లో అందరూ తినేటప్పుడు ముందు మగాళ్ళకు పెట్టి తర్వాత పిల్లలకు పెట్టి అడుగూ బొడుగూ కుండ కడుక్కొని ఇంటావిడ తింటుంది. కుటుంబంలో పిల్లలకు ముందుపెట్టడం సహజం, న్యాయం. వారు రెక్కలు రాని వారు. తల్లి దండ్రుల మీద ఆధారపడేవారు. మరి ఆలు మగలు ఇద్దరూ పని చేస్తున్నప్పుడు ఇద్దరికీ బలమైన తిండి కావాలి. లేని కుటుంబాలలో ఉన్న కాస్త చెరిసగం తినాలి. అలా జరుగుతున్నదా ? జరగటం లేదు. కారణం పురుషుడు గొప్ప; స్త్రీ తక్కువ. పురుషుడు యజమాని; స్త్రీ పనికత్తె. కనీసం తిండికి కూడా నోచుకోలేని స్థితిలో ఉన్నది. శ్రామిక వర్గ స్త్రీ. ఈ పరిస్థితి అన్యాయమని చెప్పాలంటే ఇది కేవలం స్త్రీల సమస్య అని గుర్తించడం అవసరం.

## సమాజ పరంగా

సామాజికంగా పురుషులకు లేని సమస్యలు స్త్రీలకు ఇతోధికంగా ఉన్నాయి.

*1.* శీలము, పేర్పాటు: స్త్రీకి శీలమే భూషణమట. శీలమంటే సత్యం పలకటం, సహనం ప్రదర్శించడం, దయ, సానుభూతి కలిగి ఉండడం కాక లైంగిక నీతిని మాత్రం పేర్కొంటున్నారు. పురుషుడు బహుభార్యాత్వాన్ని అవలంబించవచ్చని హిందూ ముసల్మాను మతాలు అతనియెడ పక్షపాత బుద్ధితో వ్యవహరించాయి. స్త్రీకి సర్వ సాధారణంగా - ఏదో కొన్ని కొండజాతులలో తప్ప ఏక భర్తృత్వం నియమం. ఆమె ఒకే భర్తను కలిగి ఉండాలి. ఇది ప్రాంద్ర నీతి. ఈ అంశాన్ని అటుంచినా మరో విషయం కొట్టవచ్చినట్లు కన్పిస్తున్నది. లైంగిక ప్రవర్తనలో కాలు జారిన స్త్రీని కులట అని, పతిత అని పేర్లు పెట్టి నిందిస్తారు. కాని అదే పనిని పదే పదే చేస్తున్న పురుషుని పీస మెత్తు కూడా విమర్శించరు. దీని వెనుక స్త్రీ పురుషుని ఆస్తి అనే భావం ఇమిడి వుంది. ఆమె దేహం అతని సొత్తు. దానిని ఇతరులు తాకరాదు. ఇలా ఆంక్షలు పెట్టి ఆమె శీలం భంగం అవుతుందేమోననే భయంతో ఆమెకు ముసుగులు,* మేలి ముసుగులు, పరదాలు, బురఖాలు ఏర్పాటు చేశారు. కాస్త కలిమి ఉండే ఈ ఆచారాలు లేని కుటుంబాల వారు కూడా వీటిని అనుకరిస్తారు. పర పురుషునితో స్త్రీ మాట్లాడరాదు. నిన్న మొన్నటి వరకు హిందూ సమాజంలో మధ్య తరగతి స్త్రీ తలుపు చాటున ఉండి పరాయి మొగ వాడితో మాట్లాడవలసి వచ్చేది. స్త్రీని వేరుగా ఉంచడం, చూడటం అలవాటయింది. సభలలో కూడా స్త్రీలు వేరుగా పురుషులు వేరుగా కూర్చోవలెననే సంప్రదాయం పుట్టింది.

*2.* విద్య : ఆడది చదువుకొని ఉద్యోగాలు చేయాలా ఊళ్లేలాలా అనే భావంతో ఆమెకు చదువుకు దూరం చేయటం జరుగుతున్నది. చదివించినా అది నామకాలపు చదువు మాత్రమే. అంతటితో సరిపెట్టారు. భర్త కన్న ఎక్కువ చదువు, నైపుణ్యం సంపాదిస్తే అది తప్పు.

3. సామాజిక వ్యవహారాలలో కుల తగవులలో పెత్తనం అంతా పురుషులదే. స్త్రీని ఆ పంచాయతీలలోకి రానివ్వరు.

4. మత కార్యక్రమాలు మంచివని తలంచినా ఏ ఒక్క దేవాలయంలోనో తప్ప అన్ని దేవాలయాలలోను-అన్ని మతాలలోను స్త్రీ పూజారిగా ఉండ

రాదు. కాని ఆమె భజనకు పనికి వస్తుంది, పూజాదులకు వస్తువులు సమకూర్చ టానికి పనికి వస్తుంది.

**5.** *భార్యలకు దండన:* భార్యను దండించే హక్కును మతాలు సంప్రదాయాలు భర్తకు ప్రసాదించాయి. 'నా భార్యను నేను కొట్టుకుంటాను నీకేమిటి?' అని త్రాగుబోతు భర్త అనడం, కలుగజేసుకొని వారింప పూనిన పెద్ద మనిషిని భార్యకూడా నిందించడం తరచు చూస్తున్నాం. భార్యలను దండించడం అభ్యున్నతికి పేరు పొందిన పాశ్చాత్య దేశాలలో కూడ చూస్తున్నాం, వింటున్నాం. ఇక మధ్య ప్రాచ్య రాజ్యాల విషయం చెప్ప నక్కర లేదు. ఎంత మందపు త్రాడుతో ఆమె వీపు చిట్లకొట్టాలో నిర్ణయించాయి దేశాచారాలు. ముఖ్యంగా తూర్పు దేశాలలో పీడిని ఒక పద్ధతిలో జరుపుతూ వుంటారు, ఇలా ప్రపంచ మంతటా భార్యను దండించే హక్కును భర్తలు చలాయిస్తున్నారు. వేల సంవత్సరాలుగా ఇది స్త్రీల ప్రత్యేక సమస్య గాక మరెవ్వరి సమస్య?

**6.** *అవమానాలు; అత్యాచారాలు :* ఇద్దరు మగవాళ్ళు పోట్లాడు కుంటూ వారి వారి కుటుంబాల ఆడవాళ్ళను చెడ తిట్లాను. సామాన్యంగా ఒట్టే తిట్టు 'లంజ కొడకా' కూడా స్త్రీపరంగా ఉంటున్నది. అవతలి మగాడిని తిట్టడానికి అతని తల్లిని తిట్టవలసిన అగత్యమేమిటి? అతని తల్లి, అక్కచెల్లెళ్ళు, భార్య మొదలయిన స్త్రీలు అతని ఆస్తి కనుక అవతల మనిషి మీద కోపం వస్తే అతని ఆస్తిని చెడకొట్ట పూనడం మామూలుగా జరుగుతున్న పని. కనుక అవతలి మగాడు స్త్రీలను బండ బూతులు తిట్టటం, అంతే కాదు అతనిపై పగ తీర్చుకోటానికి అతని భార్యను, తల్లిని, అక్కచెల్లెళ్ళను చెరచటం కూడా ఆ ప్రక్రియలో భాగమే. అదే మనస్తత్వం గోచరిస్తుంది. ప్రాణముంది, మెదడు ఉంది, ఆలోచించ గల శక్తి ఉండి తనతో సమానంగా చాకిరీ చేసే స్త్రీని పురుషుడు తన సొంతం చేసుకున్నాడు. ఆవు, బర్రె, మేక, కోడి లాంటి పెంపుడు జంతువులు, పశువుల లాగా ఆమె అతనిది. ఆమెపై, అతనికి సర్వాధికారాలు. "నేను మనిషిని" అని నిలబడటానికి స్త్రీ చేసే ప్రయత్నం ఆమెకున్న ప్రత్యేక బాధా నివారణ కోసం కాక మరి దేనికి?

*7. భార్య శరీరంపై హక్కు :* భార్య శరీరంపై భర్తకు పూర్తి హక్కు ఇచ్చాయి మతం, శాసనం, సంప్రదాయం. ఆమెకు ఇష్టం లేకపోయినా మగనికి మనసైతే ఆమె అతని కోర్కె తీర్చ వలసిందే. అతని పొందును కాదనటానికి వీలు లేదు. ఆమె అతని చేతిలో కీలుబొమ్మ.

*8. సంతానం కనటం :* భర్తకు ఇష్టమయినంత కాలం ఆమె సంతానాన్ని కనవలసిందే. బలహీను రాలినని, రోగిష్టి దానినని తప్పించుకో రాదు. మగ పిల్లవాడు పుట్టేవరకు పిల్లలను కనమంటే పదిమంది ఆడ పిల్లలు పుట్టినా మరల పురుడు పోసుకోవటానికి తయారు కావలసిందే. ఒకవేళ పిల్లలకు చేయలేక ఒకరితోనో ఇరువురితోనో సరిపెట్టుకుందామని ఆమె ఆలో చించినా అతడు వ్యతిరేకిస్తే ఆమె మాట సాగదు. ప్రస్తుతపు శాసనం ప్రకారం పిల్లలను ఆపు చేసుకునే ఆపరేషను చేయించు కోవటానికి ఆమెకు హక్కు ఉన్నా, ఆ హక్కును ఆమె వినియోగించుకుంటే భర్త తగవు పెడతాడు. ఇంట్లో నుంచి వెళ్ళకొట్టాడు. చుట్టూ ఉన్న సమాజం ఈసడిస్తుంది. చివరకు ఇరుగు పొరుగు అమ్మలక్కలు కూడా ఆడిపోసుకుంటారు. ఆమె జీవితం అల్లకల్లోలం అవుతుంది. ఆమె శరీరంపై ఆమె హక్కును పొందడం నిక్కచ్చిగా స్త్రీ సమస్యయే ?

*9.* స్వంత ఆర్జన పనికిరాదు ఇటీవలి వరకు మధ్యతరగతి కుటుంబాలలో స్త్రీ ఉద్యోగం చేయటం తప్పుగా భావించేవారు. ఇప్పటికే ఉద్యోగాలు చేసే స్త్రీల సంఖ్య బహు తక్కువే. శ్రామిక వర్గంలో ఆ పేచీ లేదు. కాగా చదువుకున్న వర్గాలు సమాజాల ఆచారాలను, సంప్రదాయాలను, భావాలను చాలా వరకు నిర్దేశిస్తున్నాయి. వాటినే శ్రామిక వర్గాలు కూడా ఆమోదిస్తున్నాయి. కనుక విధి లేక. గత్యంతరం లేక శ్రామిక వర్గ పురుషులు తమ భార్యలను కూలికి పోనిస్తున్నారు కాని కాస్తో డబ్బు రాగానే మాన్పిస్తున్నారు. ఉద్యోగం పురుష లక్షణమట. లక్షల మంది స్త్రీలు పొలాల్లో నాట్లు వేస్తుంటే, కలుపులు తీస్తుంటే, పైర్ల కోత కోస్తుంటే వారి కష్టాన్ని చూడకుంటున్న సమాజం ఎందుకు ఈ దొంగ మాటలు చెప్తున్నది ? దానికి కారణం ఒకటే ! ఆడది కనుక సంపాదిస్తే ఆమె స్వాతంత్ర్యాన్ని కోరుతుందనే భయం. కనుక నే

ఆపనిని మంచి విషయంగా చెప్పక గతిలేక చేసే దానినిగా పరిణిస్తున్నారు. దాని ఆంతర్యం ఇది. ఇది స్త్రీలు చేసిన కుతంత్రం కాదు కదా! ఈ విధానానికి బలి అవుతున్నది వారే కదా! ఈ పద్ధతి మారాలని ప్రధానంగా వారే నడుం కట్టాలి కదా!

*10.* పెండ్లి:- ఆడది విధిగా పెండ్లిచేసుకోవాలట. ఆమె ఈడేరితే తల్లి దండ్రుల రొమ్ముల మీద కుంపటి యట. ఆమె భారమట. ఆమె బరువును వారు దించుకోవాలిట. ఒక అయ్య చేతిలో పెట్టి వారు తమ బాధ్యతను నెర వేరుస్తారట.

పెండ్లికి ఒప్పించటానికి మగాడికి కట్నం యిస్తారు ఆడపిల్ల తల్లి దండ్రులు మధ్యతరగతి కుటుంబాలలో. కట్నం ఇవ్వలేని వారి పిల్లలకు పెండ్లికాదు.

పెండ్లి కూడా కన్య ఇష్టాయిష్టాలపై ఆధారపడదు. తల్లిదండ్రులు నిర్ణయించిన వరునినే ఆమె చేపట్టాలి.

గ్రామీక కుటుంబాలలో ఓలి పద్ధతి ఉంది. కొన్ని కులాలలో మారు మనువు ఆచారం కూడా కన్పడుతుంది. కాని పిల్ల మగడిని వద్దంటే ఓలిని ఆమె మగనికి తిరిగి ఇవ్వాలి. ఆమె వద్ద పైకం ఉండదు. దానిని అంతకు ముందే ఆమె తల్లి దండ్రులు ఖర్చుపెట్టుకొని ఉంటారు. అది వారి సొత్తు. కనుక ఈ మగని పీడ వదిలించుకోడానికి ఆమె ఎవరో ఒకరిని పెండ్లాడ టానికి అంగీకరించి ఆ రెండవ పురుషుని చేత ఓలి మొదటి భర్తకు ఇప్పిం చాలి. రెండవ మగడు ఆమెను ఆదరించక పోతే ఆమె అవస్థ వర్ణనాతీతం. ఒకసారి ఒక కుటుంబంలో ఆమె గతిలేక ఏడు సార్లు మారుమనువు చేసుకోవలసి వచ్చింది. ఈ పద్ధతిలో కూడా ఆమె ఒక వస్తువుగా ఎంచబడుతుంది. తల్లి దండ్రులు ఆమెను పైకం తీసుకొని మరియొకనికి ఇస్తారన్న మాట.

ఇక కట్నం ఇచ్చే విషయంలో స్త్రీ బాధ చెప్పనక్కరలేదు. తల్లి దండ్రులు ఎవరు వరునికి పైకం లేక ఆస్తి ఇచ్చి తమ పిల్లను అతని అధీ నంలో పెట్టారు. మొత్తంమీద ఆమె తల్లిదండ్రుల అధీనంలో నుండి పెని మిటి అధీనంలోకి పోతుంది. ఆమెకు వ్యక్తిత్వం లేదు; స్వాతంత్ర్యం లేదు.

**రాజకీయంగా :**

1. నిన్న మొన్నటి వరకు స్త్రీకి ఓటు హక్కు లేదు. ఉన్నా చెప్పినట్లు వోటు వేయాల్సిందే. లేకపోతే ఆమెకు తన్నులు తప్పవు.

2. రాజకీయ పార్టీలలో స్త్రీలను ఉన్నత స్థానాలకు రానియ్యరు. ఆ దార ప్రాయంగా లేక కళ్ళ నీళ్ళు తుడుపుగా 30 స్థానాలున్న చోట ఒక సభ్యత్వం ఇస్తారు.

3. ప్రజా ప్రాతినిధ్య స్థానాలలో సుమారు 300 మంది ఉన్న శాసనసభలో పన్నెండు మంది స్త్రీలుంటున్నారు. 525 మంది ఉన్న పార్లమెంటు స్త్రీలు 15 నుండి పెరిగి పెరిగి ఈనాడు 42 వరకు వచ్చారు. ఇలా 10 50 మంది ఉన్న స్త్రీలకు ప్రాతినిధ్యం 100కి అయిదు మాత్రమే.

4 అత్యున్నత స్థానాలలో స్త్రీలను చేరనివ్వరు. సుప్రీంకోర్టులో స్త్రీ న్యాయమూర్తులు లేరు. హైకోర్టులలో దేశం మొత్తం మీద పన్నెండు లేక పదిహేను మంది కన్నా లేరు. ప్రభుత్వ కార్యదర్శులుగా 100కి నలుగు కూడా లేరు.

5. ప్రభుత్వ ప్రణాళికలవల్ల సహాయం ఇంచుమించుగా అంతా పురుషులకే చెందుతుంది. ఉచితంగా ఇచ్చే భూములు, ఇళ్ళు, స్త్రీలకు ఇవ్వటం లేదు అప్పులు పురుషుల పేరనే పుట్టున్నాయి. స్త్రీలకు చెందే సహాయం నామ మాత్రం.

6. పంచాయితీలలో, పంచాయితీ సమితులలో, జిల్లా పరిషత్‌లలో స్త్రీల స్థానం అలంకార ప్రాయం. స్త్రీలకు న్యాయం చేకూరుస్తున్నామని చెప్పుకోటానికి ఇచ్చేవి చాలా కొద్ది మాత్రమే.

7. మంత్రివర్గాలలో స్త్రీలకు శిశుసంక్షేమం లాంటి శాఖలు మాత్రమే ఇస్తారు. అంటే స్త్రీలు కుటుంబాన్ని చూసుకోవటం, పిల్లలను పెంచటంలో మాత్రమే నేర్పరులు అన్న భావం బలంగా ఉందన్న మాట.

8 ఉద్యోగాలలో ఉన్నత శిక్షణావకాశాలు, ప్రమోషన్లు మొదలైన వాటిలో స్త్రీలను నిరాదరణ చేస్తున్నారు. ఇలా ఎన్నో ఇంకెన్నో చెప్ప వచ్చును.

## ఆర్థికంగా.

1. కూలి రేట్లలో తేడా వుంది. ఆడ కూలీలకు కూలి తక్కువ, స్త్రీ పురుషులు ఇద్దరూ ఒకే పని చేసినా స్త్రీలకు తక్కువ కూలి ఇస్తున్నారు.

2. కొన్ని వృత్తులకు స్త్రీలే తగుదురని చెప్తూ ఆ వృత్తులకు కూలి జీతాలు తక్కువ చెల్లిస్తున్నారు. నాట్లు వేయడానికి స్త్రీలే తగుదురట. కాని పొలంలో పని చేసే పురుషులకు కూలి ఎక్కువ. ఏ పని కష్టం దాని కున్నదే. కాల వ్యవధి సమానం. నాట్లు వేస్తే, ప్రత్తి ఏరితే, కలుపు తీస్తుంటే నడుములు విరిగి పోతాయి. అవి తేలిక పనులు కావు. కాని ఆ పనులంటే చులకన భావం చూపిస్తున్నది సమాజం.

3. ఇద్దరూ ఒకే వృత్తి చేస్తున్నా క్రొత్త పని నేర్చుకోవటానికి అవకాశాలు ఇవ్వరు. ఉదాహరణకు, కట్టుబడి పని చేసే స్త్రీ పురుషులున్నా, రాళ్ళు అందించే పురుషుడు 2, 3 ఏళ్ళల్లో తాపీ పని వాడవుతున్నాడు. ఆ పని అతనికి నేర్పుతున్నారు. తట్టలు మోసే స్త్రీ ఆజన్మాంతం తట్టలు మోయ వలసిందే.

4. కుటుంబంలో స్త్రీ పురుషులిద్దరూ పని చేస్తున్నా ఆమె సంపాదన పై పెత్తనం పురుషునిదే. తండ్రి లేక భర్త ఆమె ఆదాయాన్ని భుక్తం చేసుకుంటారు. ఆమె తన స్వంత ఖర్చులకు వారిని బిచ్చమెత్తవలసి వస్తున్నది.

5. ఆస్తిని భార్య కూడా సమానంగా సంపాదించినా ఆస్తి సాధారణంగా ఆమెభర్త పేరనే ఉంటున్నది.

(6) శాసనాల ప్రకారం స్త్రీకి భర్త ఆస్తిలో తక్కువ వాటా వస్తోంది. ముస్లిం లా ప్రకారం పిల్లలుంటే 1/8 లేకపోతే 1/6 మాత్రమే. హిందూ లా ప్రకారం ఆమె అతని కుమారులతో, కుమార్తెలతో అత్తతో సమానంగా పంచుకుంటుంది అతని స్వార్జితపు ఆస్తిలో. అతని పిత్రార్జితపు ఆస్తిలో పుట్టుకతో హక్కున్నది కుమారులకు. ఇపుడు కుమార్తెలకు అలాంటి హక్కు ఇవ్వాలని తెలుగుదేశ ప్రభుత్వం బిల్లు ప్యాసు చేయించింది. అంటే పిత్రార్జితపు ఆస్తిలో కుమార్తెల, కుమారులు, భర్త పంచుకోగా వచ్చిన భర్త ఆస్తిలో విభాగాలు

కుమారులతో, కుమార్తెలతో, అత్తతో సమానంగా పంచుకుంటుంది. దీనిని బట్టి ఆస్తిని పెంచి పెద్దచేసి జాగ్రత్త చేసిన భార్యకు ఎంత అన్యాయం జరుగు తున్నదో గమనించవచ్చు.

(7) ప్రభుత్వ ప్రణాళికల విషయంగా స్త్రీలను చిన్నచూపు చూడటం జరుగుతున్నది.

## సాంస్కృతికంగా:-

విద్యకు దూరంగా ఉంచబడిన స్త్రీ సాహితీ సంస్కృతులకు దూరం అవుతోంది. మనిషిని ఉదాత్తుని చేసే కళలలో, సాహిత్యంలో ఆమెకు ప్రవేశం తక్కువగా లభిస్తున్నది. ఇప్పటికీ నాటకాలలో వేషాలు వేయటానికి వివాహిత స్త్రీలు ముందుకు రావడం లేదు. కవిత్వం, లలిత కళలు సంగీతం మొదలుగా గల వాటిలో స్త్రీలకు సముచిత స్థానం లభించడం లేదు.

ఇంటి పనితో సతమత మయ్యే స్త్రీలు సాంస్కృతిక కార్యక్రమాలలో బహు తక్కువగా పాల్గొంటున్నారు. దానివల్ల స్త్రీలు నష్టపోతున్నారు. సమాజమూ నష్టపోతున్నది.

స్త్రీల సాంస్కృతిక వెనుకబాటుతనం ప్రధానంగా స్త్రీల ప్రత్యేక సమస్యయే.

## ముగింపు :-

ఇలా ఎన్నో అంశాలను ఉటంకించ వచ్చును. పైన పేర్కొన బడిన అంశాలు సోదాహరణంగా చెప్పబడినవి మాత్రమే. జాబితా సమగ్రము కాదు. సమస్య కూలంకషంగా చర్చించటానికి వీలులేదు కొద్ది సమయంలో. కాకపోతే విషయాన్ని దర్శనం చేయించడం జరిగింది.

ఇన్ని అంశాలు స్త్రీలను బాధిస్తున్న విషయాలుగా విశదీకరించబడినా స్త్రీలకు వేరే సమస్యలు లేవని ఎవరైనా ఇంకా వాదించ పూనుకుంటే మనం చేయగలిగింది లేదు. అది వారి అమాయకత్వమన్నా కావాలి లేక అజ్ఞాన

మన్నా అయియుండాలి. ఈ రెండూ కాకపోతే వారి ఉద్దేశ్యాలు తప్పక సందే హాస్పదం అయినట్లుగా ఎంచుకోవాలి

స్త్రీలకు ప్రత్యేక సమస్యలు ఉన్నాయని చెప్పినంత మాత్రాన పురుషు లకు ప్రత్యేక సమస్యలు లేవని కాదు. కాగా స్త్రీల ప్రత్యేక సమస్యలు బహు సంఖ్యాకం పురుషుల ప్రత్యేక సమస్యల సంఖ్య అల్పాతి అల్పం. అదీ గాక ఇంతవరకు సమాజంపై పెత్తనం సాగిస్తున్నది పురుషులు. కనుక పురు షులు తామే సమాజము, సమాజమే తాముగా వ్యవహరించారు. స్త్రీలకు ప్రత్యేక సమస్యలున్నాయని గ్రహించిన ఉదార పురుషులు కొద్దిమంది. వారు స్త్రీ జనాభ్యుదయానికి కృషిచేశారు. మహిళా పురోగతికి దోహదం చేశారు. అది కాదనలేని మాట; కాదనరానిమాట.

మహిళా దశాబ్దం మూలంగా స్త్రీలలో ప్రపంచ వ్యాప్తంగా చైతన్యం వెల్లివిరిసింది. స్త్రీల సమస్యలపై దృష్టి సారించడం జరిగింది. స్త్రీ శక్తిపై స్త్రీలకు విశ్వాసం పెరిగింది. స్త్రీలకు ప్రత్యేక సమస్యలు ఉన్నాయని గుర్తించిననాడు మహిళాభ్యుదయానికి స్త్రీలు బాటలు వేసుకోగలరు.

ఇచ్చట మరో మాట చెప్పాలి. ఒకవేళ స్త్రీల సమస్యలు వేరే లేవని భావించినా ప్రత్యేక అధ్యయనం నిమిత్తం వేరు వేరు సమస్యలను ప్రత్యేకంగా పరిశీలించటం అవసరం. ఆ పద్ధతి ఫలప్రదం. స్త్రీలకు సంబంధించిన సమస్యలను అన్నింటినీ ఒకచోట ఏర్చికూర్చితే అవే స్త్రీ సమస్యలు అవు తాయి. స్త్రీల సమస్యలను పరిష్కరించుకోటానికి స్త్రీలే ముమ్ముందుగా ఉద్య మించాలి. కాలికి ముల్లు గుచ్చుకున్న వ్యక్తికి దాని బాధ తెలిసినంతగా ఇతరు లకు తెలియదు. బాధితుడు అనుభవంపై ఆధారపడతాడు. చూచేవారు ఊహపై ఆధారపడతారు. సానుభూతి కల పురుషులు సహాయం చేస్తారు; చేయగలరు. కాగా ప్రధాన భూమిక ఈ విషయంలో స్త్రీలది కాక తప్పదు. అనాడే వారి సమస్యలు సమసిపోతాయి.

## దేశ దేశాల మహిళల సమస్యలు

స్త్రీ పురుష సమానత్వం మూడు పువ్వులూ, ఆరు కాయలుగా ఏ దేశం లోనూ లేదు. కొందరికి సామాజిక సమస్యలుంటే మరి కొందరకు ఆర్థిక

ఇబ్బందులకు గురి అవుతుంటే రాజకీయ, మత సమస్యలకు బాధపడే స్త్రీలు హెచ్చు స్థాయిలోనే వున్నారనేది నగ్నసత్యం. "ఆల్ మెన్ ఆర్ క్రియేటెడ్ ఈక్వల్" అని 1776 లో అమెరికన్ రాజ్యాంగం నిర్వచించిన పంద సం॥కు స్త్రీల సమాన హక్కుల గురించి రాజ్యాంగ సవరణ జరగాలనే పోరాటం గాలి దుమారం లేపినా చివరికి ఆ సవరణ వీగిపోయింది ఈనాడు రష్యన్ స్త్రీలకు రాజకీయంగా ప్రవేశం వున్నా, ఆర్థిక సమానత్వం వున్నా, ఇంటిపనిలో భర్త పాలుపంచుకోక పోవడంతో విసిగి వేసారిపోయిన మాస్కో మహిళలు భర్తల నుండి విడిపోవటానికి సిద్ధపడుతున్నారు. రెండు ప్రపంచ యుద్ధాల్లో పోరాడి అశేష త్యాగాలు చేసిన ఫ్రెంచి మహిళలు 1944 దాకా ఓటు హక్కును పొందలేక పోయ్యారు. గొప్ప సోషలిస్టు దేశంగా ప్రఖ్యాతి పొందిన చైనాలో ఒక్క పిల్లకన్నా కనరాదన్న ప్రభుత్వ నిషేధం వల్ల ఆడపిల్లను కన్న తల్లిపై పితృస్వామ్య వ్యవస్థా వారసత్వమైన ఒత్తిడి అధికమౌతోంది.

బ్రెజిల్ స్త్రీలు పరిపాలనా వ్యవస్థలో సమానభాగస్వామ్యం కావాలని కోరుతున్నారు. ఫిలిప్పైన్ దీవులలో తనకు ఆదాయం వుంటే భార్యను పనిచేయ వద్దనే హక్కు భర్తకున్నది. ఈజిప్టు స్త్రీలకు ఆస్తి హక్కు వున్నా దానిపై అధికారం పురుషులదే. ఇండోనేషియా దేశంలో 1974లో వచ్చిన శాసనం ప్రకారం భార్య గొడ్రాలయితే భర్త మరొక స్త్రీని వివాహ మాడవచ్చు. కెనడాలో ప్రభుత్వంకట్టించే ఇళ్ళు కేవలం దంపతులకే ఇస్తున్నారని-కన్యలకు విధవలకు, విడాకులు పుచ్చుకున్న స్త్రీలకు కేటాయించడం లేదని ఆ స్త్రీలు బాధ పడుతున్నారు. కీన్యాదేశపు స్త్రీలు బహుదూరం నుండి నీరు తెచ్చు కోలేక పోతున్నామని, మాలవి దేశంలో 80% స్త్రీలు పాఠశాల ముఖమే చూడని పరిస్థితి వుందని వార్తలు వస్తున్నాయి. ఇక పాకిస్తాన్, సౌదీ అరేబియా దేశాలలో వ్యభిచార నిరోధం పేరుతో స్త్రీని కొరడాలతో కొట్టటం, కాన్పు కష్టమైనా మంత్రసానులే చెయ్యటం లాంటివి అమల్లో వున్నాయి. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో! మరెన్నో?